# శక్తివిశిష్టాద్వైత సిద్ధాంతము.



అనువాదకర్త :

బండారు తమ్మయ్య.

శివధర్మ గ్రంథమాలికా బిల్వము ౧౭.

శ్రీ

# శక్తివిశిష్టాద్వైత సిద్ధాంతము.

అనువాదకర్త

"విమర్శకాగ్రేసర"

శ్రీ బండారు తమ్మయ్యగారు.

ప్రథమ ముద్రణము ౧౦౦౦ ప్రతులు.

ప్రకాశకులు :

శైవభారతీ భవనము.

జంగమవాడీ మఠము-

బనారస్ సిటి (కాశీ.)

౧౯౫౫

[వెల. ౦-౮-౦.

శ్రీ జగద్గురు విశ్వారాధ్య సింహాసనము జంగమవాడీ మఠము—కాశీ.

# నివేదనము

శ్రీకాశీవిశ్వారాధ్య జ్ఞానసింహాసనాధీశ్వరులు, కీర్తి శేషులు శ్రీజగద్గురు వీరభద్రశివాచార్య మహాస్వాములు వారి జీవిత చరిత్రము. ఉత్తమ కార్యాచరణము, నేటి వీరశైవమతేతి హాసమునందు సువర్ణాక్షరములతో లిఖింపదగియున్నవి. వారొనర్చిన ఘనకార్యములు పెక్కింటిలో 1925 సంవత్సరమున వారు కాశీలో విద్యాభ్యాస మొనర్చుకాలముననే శైవమత గ్రంథసంపాదనముకయి 'శైవభారతీ భవనము' స్థాపించుటయు, తన్మతగ్రంథ ప్రకటనముకయి 'శివధర్మ గ్రంథమాలిక' నెలకొల్పుటయు, 1939 సంవత్సరములో మతసారస్వత సేవకయి 'విభూతి'యనుమాసపత్రిక తెలుగున వెలువరించుటయు ముఖ్యముగా పరిగణింపదగి యున్నవి. ఈగ్రంథమాలికయందు వారి జీవితకాలములో 12 గ్రంథములు ప్రకటితములయి యున్నవి. పయిసంస్థలమూలమున వారుగావించిన మత, సారస్వత సేవకయి వీరశైవలోకము వారి కెంతేని ఋణపడియున్నదని వేఱె చెప్పనక్కఱలేదు.

పూర్వాశ్రమమున పండిత చిదిరెమఠము వీరభద్రశర్మ గారను పేరితో వ్యవహరింపబడిన వీరు శ్రీజగద్గురు కాశీవిశ్వారాధ్యజ్ఞాన సింహాసనమునకు తారణసంవత్సర విజయ దశమీ దినమున (1944 సంవత్సరములో) పట్టాభిషిక్తులయిరి. వారి

పాండిత్యముబహురూపక మయినదనుట జగద్విశ్రుతము. వేదతీర్థ, స్మృతితీర్థ, కావ్యతీర్థ, ధర్మాచార్య, సాహిత్యవిశారద, విద్యారత్న, విద్యానిధి ప్రముఖబహుపట్ట భద్రులయిన వీరు దేశమందంతటను పండితవర్యులు, పరిశోధకులు, భాషాతత్త్వ, పురాలిపివేత్తలు, అని విద్వల్లోకమున వినుతిగాంచి యుండిరి. విధి విరామములేని విద్యాపరిశ్రమాదికముల వలన నారోగ్యముచెడి రమారమి నలుబదిరెండేండ్ల ప్రాయమున 1948 సంవత్సరమున వారకాలమున శివైక్యమొందుట వీరశైవలోకము యొక్క దురదృష్టము. కాశీవిశ్వారాధ్య పీఠమునధిష్ఠించిన మూడు వత్సరముల స్వల్పవ్యవధిలో విశేషకృషియొనర్చి "జ్ఞానమందిర" మను పేరితో జంగమవాడీ మఠావరణమున వారునెలకొలిపిన పుస్తకాలయము వారి దివ్యకీర్తిస్మారకచిహ్నముగ వెలుగొందుచున్నది. వారియనంతర మీసింహాసన మధిష్ఠించిన వారి శిష్యవర్యులు శ్రీజగద్గురు విశ్వేశ్వరశివాచార్య మహాస్వాములు వాసుగూడ గురుభక్తితత్పరులయి తమగురువుగారు సంకల్పించిన ఘనకార్యముల నిర్వహింప శక్తివంచనలేక కృషియొనర్పనుత్సాహముతో నుద్యమించుట యెంతయు ముదావహము. శివధర్మ గ్రంథమాలిక కొనసాగుటకయి శ్రీవీరభద్ర శివాచార్య మహాస్వాములువారి యనంతరము వీరింతవఱకు 13బిల్వముగ "జంగమవాడీ మఠకాప్రాచీనత్వ" అను గ్రంథమును హిందీభాషయందును, 14, 15 బిల్వములుగ "వీరశైవరత్న" "శక్తివిశిష్టాద్వైత సిద్ధాంత" అను గ్రంథములను మరాఠీ

భాషయందును వెలువరించి, 16 బిల్వముగా "వీరశైవవివాహ విధి" యను గ్రంథమును ఆంధ్రలోకమునకు సుపరిచితులును, శ్రీవీరభద్ర శివాచార్య మహాస్వాములు వారికి చిరమిత్రులు, ప్రియశిష్యులునగు 'విమర్శకాగ్రేసర' శ్రీ బండారు తమ్మయ్య గారి యనువాదముతో ఆంధ్రభాష యందును ప్రకటించి యున్నారు. 1953 సంవత్సరమున వెలువరించిన యీ కడ పటి గ్రంథముయొక్క నివేదనములో సూచించినట్లు నేడు "శక్తివిశిష్టాద్వైత సిద్ధాంతము" అనెడి యుత్తమ మత గ్రంథమునకు శ్రీ తమ్మయ్యగారు గావించిన యనువాదమును ప్రకటించుచున్నారు. తమ మత తత్త్వ, సిద్ధాంతముల సంగ్ర హముగనైనను తెలిసికొని యవగత మొనర్చికొనుట వీరశైవుల కెల్ల మిక్కిలి యావశ్యకమనుట చెప్పనక్కఱలేదు. వీరశైవు లకు, తదితర లోకమునకుగూడ వీరశైవ మతసిద్ధాంతము సుబోధకమగుటకై యీగ్రంథమును మొట్టమొదట మైసూరు నందలి పంచాచార్య ప్రభా సంపాదకులు, తద్గ్రంథ మాలికా స్థాపకులు, నాగనూరు బృహన్మఠాధ్యక్షులు కీ॥ శే॥ శ్రీపండిత కాశీనాథశాస్త్రిగారు కన్నడమున రచించి ప్రకటించియు న్నారు. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ భాషలలో దీనికనువాదము లింతకుమున్నే వెలువడియున్నవి. ఆంధ్రానువాదములేని కొఱత నేడు తీఱినది. సహజ, సరళ శైలిలో తమ్మయ్యగారు రచించిన యీయనువాదమును ఆంధ్రులెల్లరు సాదరముగ జదివి వీరశైవ మతసిద్ధాంతమును సంగ్రహముగనైన గ్రహింతురుగాక యని

హెచ్చరించుచున్నాము. ఇట్లే యింతవఱకు ముద్రితముగాని యనేక మతగ్రంథములను క్రమముగా ప్రకటించి శైవప్రపంచము నకు సేవగావింప నిశ్చయించియున్నాము. ప్రభుత్వము వారి "జమీందారీ రద్దుచట్టము" మూలమున జంగమవాడీమఠము నకు విశేషనష్టముగలిగి దాని ప్రస్తుతాదాయము మఠము యొక్క జీవికకే చాలకయున్న దురవస్థనిదివఱకే "ఆంధ్రవీర శైవ వివాహ విధి" యందు గావించిన నివేదనములో తెలిపి యున్నాము. "ధనమూల మిదం జగత్" అనుట యందఱెఱింగినదే. ఎట్టి సత్కార్య సంకల్పములనయిన ధనసాహాయ్య ములేనిచో నిర్వహించుట దుస్తరము. కావున శ్రీ వీరభద్ర శివాచార్య మహాస్వాములువారు నెలకొల్పిన "శైవభారతీ భవనము", "శివధర్మ గ్రంథ మాలిక", సుస్థిరములయి సంఘసేవ, మత సేవ గావించుటకయి, మతాభిమానులు, విద్యాభిమానులు తమ యాదరణాభిమానముల బఱపి మహా దార్యముతో తమ విరాళములనంపి మాకు తోడ్పడెదరు గాకయని మరల మరల ప్రార్థించుచున్నాము.

ఇట్లు,

| కాశీ<br>జంగమవాడీ మఠము } | ప్రకాశకులు<br>శైవ భారతీ భవనము |
|---|---|

# పీఠిక.

---

"ఆంధ్రవీరశైవవివాహవిధి" యనెడి యనువాద గ్రంథమును నాచేత వ్రాయించి 1953 సంవత్సరములో శివధర్మ గ్రంథమాలికా ౧౬ బిల్వముగ ప్రకటించునప్పుడు, ఆగ్రంథమున గావించిన నివేదనములో ప్రకాశకులు కాశీజంగమవాడీ మఠమునందలి శ్రీ శైవభారతీభవనమువారు వీరశైవమతతత్త్వమును సిద్ధాంతమును ఆంధ్రవీరశైవులకు సులభముగ వివరించుటకయి "శక్తివిశిష్టాద్వైత సిద్ధాంతము" అను గ్రంథమునుగూడ నాయనువాదముతో కొలదికాలములో వెలువరింతుమని సూచన గావించియున్నారు.

అందుకనుగుణముగ శ్రీకాశీవిశ్వారాధ్యజ్ఞానసింహాసనాధీశ్వరులగు శ్రీజగద్గురు విశ్వేశ్వరశివాచార్య మహాస్వాములు వారి యాజ్ఞననుసరించి నేడీ గ్రంథమునుగూడ ననువదించి వారికి సమర్పించితిని. లోకమున కుపకరించుటకుగాను, వీరశైవమతతత్త్వమును సిద్ధాంతమును సంగ్రహముగ వివరించుచు కీ. శే. శ్రీపండిత కాశీనాథశాస్త్రిగారు కన్నడభాషలో రచించిన గ్రంథమున కిదియనువాదము. ఆగ్రంథమునకు ఇంగ్లీషు, హిందీ, మరాటి భాషలలో అనువాదములింతకుపూర్వమే వెలువడియున్నవి. ఇది కేవలము మతసిద్ధాంతమును బోధించుగ్రంథమగుటచే, మునుముందు మొదటి 8 పేజీలలోను, అసలు మత మనగానేమి. భారతదేశమందలి యాస్తికమతములలోని ముఖ్యభేదములేమి, అందులో వీరశైవమననేమి, దాని లక్షణములెట్టివి, యను విషయములు పాఠకులకు స్థూలముగా తెలియుటకయి, అవతారిక యొకటిగూర్చి, అటుతరువాతనే

మూలగ్రంథము యొక్కయనువాదమును చేర్చినాను. ఆంధ్రవీర శైవులు సాధారణముగా విద్యావిషయమున మిక్కిలి వెనుక బడియున్నకారణమునను, ఇది మతవిషయక గ్రంథమగుటవల నను విషయములు సుగమముగ బోధపడుటకయి దీనిని సాధ్య మయినంతవఱకు సులభశైలిలో రచించి, విసంధులను ఎక్కు వగావాడియున్నాను. ఆంధ్రవీరశైవులెల్ల దీని నాదరించి వీర శైవమతతత్త్వ సిద్ధాంతముల గుర్తించి యందలి లాభముల బడయుదురుగాకయని యాశించుచున్నాను.

కీ. శే. శ్రీ వీరభద్రశివాచార్య మహాస్వాములువారు స్థాపించిన శివధర్మగ్రంథమాలిక కొనసాగుటకయి వారిస్థాన ము నధిరోహించిన ప్రస్తుత కాశీవిశ్వారాధ్య సింహాసనాధ్య క్షులు శ్రీజగద్గురు విశ్వేశ్వర శివాచార్యమహాస్వాములువారు గావించుచున్న నిరంతరకృషి మిక్కిలి ప్రశంసనీయము తను మనోధనములు గురులింగజంగమాధీనములను మతనైతిక ధర్మమును గ్రహించి యిట్టి సత్కార్యనిర్వహణమునకై వీర శైవులెల్లరు శక్తివంచనములేకుండ శ్రీ మహాస్వాములువారికి సర్వవిధముల దోడ్పడి చరితార్థులయ్యెదరుగాకయని ప్రార్థించు చున్నాను.

ఇట్లు,

భక్తపాదరేణువు,

బండారు తమ్మయ్య,

అనువాదకర్త.

కాకినాడ
16-2-55

శ్రీ శైవ భారతీభవన, జ్ఞానమందిర సంస్థాపకులు.



శ్రీ ౧౦౦౮ జగద్గురు విశ్వారాధ్య జ్ఞానసింహాసనాధీశ్వరులు,

కీ॥ శే॥ శ్రీ జగద్గురు వీరభద్రశివాచాచార్య మహాస్వాములువారు

శివైక్యము (ది ౨౫-౧-౧౯౪౮)

శ్రీ జగద్గురు విశ్వారాధ్యజ్ఞాన సింహాసనాధీశ్వరులు, కాశీ.



శ్రీ ౧౦౦౮ జగద్గురు విశ్వేశ్వరశివాచార్య మహాస్వాములువారు
పట్టాభిషేకము (ది ౧౪-౧౧-౧౯౪౭)

శ్రీజగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# శ్రీ శక్తి విశిష్టాద్వైత సిద్ధాంతము

శ్లో. పంచాస్య వదనోద్భూతాన్ । పంచతత్త్వాధినాయకాన్
పంచబ్రహ్మమయాన్నౌమి । పంచాచార్యాన్ జగద్గురూన్.

## అ వ తా రి క

శ్రీమదనంతంబగు చరాచరసృష్టికెల్ల, కారణ మేదయిన నున్నదా లేక సృష్టియంతయు స్వభావసిద్ధముగ తనంతట తానేర్పడుటయే దాని ప్రకృతియా, అను జిజ్ఞాస తరతరముల నుండి యీ జగత్తునందలి ప్రతి దేశమునందును ప్రబలుచున్నది. ఈ తత్త్వమును గూర్చి జరుగు చర్చకే మతము అను వ్యవహార మేర్పడినది. మన్ (ఆలోచించు) అను ధాతువునుండి మతము అను శబ్దము నిష్పన్నమయినది. బాహ్యదృష్టికి గోచరించెడి యీ చరాచరప్రపంచము తనంతట తానే యేర్పడినది కాదనియు, దీనికి కర్త (కారణము) యైన యద్భుతశక్తి యొకటి తప్పక యుండియుండుననియు నమ్ముటయే బహు దేశములందలి పలువురు విజ్ఞుల మతమయియున్నది. ఇట్టిదని గణింపరాని యీ మహాద్భుతశక్తినే, పరతత్త్వము, పరమేశ్వరుఁడు, భగవంతుఁడు అని వ్యవహరించుచున్నారు. కావున భగవంతుని యునికిని (అస్తిత్వమును) అంగీకరించు మతములు, ఆస్తికమతము

లని, అట్లుగాక యీ ప్రపంచము దాని సృష్టి, స్థితి, లయము లు వేఱొక శక్తివలన గలుగునవిగాక ప్రకృతిసిద్ధముగ నేర్పడు నవేయని తలంచు మతములు నాస్తికమతములనియు వ్యవహ రింపబడుచున్నవి.

నామరూపములు లేని పరతత్త్వమునకు నామరూప కల్పనము సాధకుని సాధనసౌలభ్యమునకే యేర్పడినది. పర మేశ్వరుని యంశము సూక్ష్మముగ సమస్తజీవులయందు నిక్షిప్త మయి యున్నది. కావున జీవులయందలి జీవాత్మకు పరమా త్మకు (పరమేశ్వరునకు) గల సంబంధమును గూర్చి భరతఖండ మున మూఁడు ముఖ్యమతములు నెలకొనియున్నవి. వానినే అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతము అని వ్యవహరింతురు. నిత్యము, సత్యము. నిరంజనమునైనది పరమాత్మయొక్కటియే యనియు, తదితరమంతయు (జగత్తుకూడ) మిథ్య (మాయ) యనియు, జీవాత్మ పరమాత్మయొక్కటే కాని వేఱుకావనియు నిర్వచించునది యద్వైతము. దీనినే సర్వాద్వైతమనికూడ చెప్పెదరు. ఈ సిద్ధాంతము నుద్ధరించినవాడు శంకరాచార్యుఁడు. పరమేశ్వరుడు కారణకర్తగా నుద్భవించినది కావున జగత్తుమిథ్య కానేరదనియు, భక్తి, సత్ప్రవర్తనము మున్నగు సాధనములచే జీవుడు శుద్ధుడయి క్రమముగ నుత్తమస్థితిలో పరమేశ్వరునితో నించుమించుగ సమానుడయి వఱలుననియు ప్రతిపాదించుచు సర్వాద్వైతము నంగీకరింపక దానికి విశిష్టముగ నేర్పడినది విశిష్టాద్వైతము. ఈ సిద్ధాంతము నుద్ధరించినవాడు రామానుజా

చార్యుడు- భక్తిమున్నగు సాధనలచే శుద్ధుడయినప్పుడుగూడ జీవుడు ఈశ్వరుని ప్రేమవాత్సల్యములకు పాత్రుడయి యాతని సమీపమున దాస భావముతోనే యుండుననియు, జీవేశ్వరులకు సేవకునకు ప్రభువునకు వలె విభేదము సర్వదా వర్తిల్లుననియు చెప్పునది ద్వైతము. దీని నుద్ధరించినవాడు మధ్వాచార్యుడు.

భారతీయవాఙ్మయములో అత్యంతప్రాచీనములని తలంపబడు వేదములలో పరమేశ్వరతత్త్వము, అగ్ని, రుద్ర, భర్గ, శివేత్యాదిగ వేర్వేఱునామములతో వ్యవహృతఃమయినను, రానురానది సులభోచ్చారణ సంయుతమగు శివశబ్దమునందు నిష్ఠితమయినది. "శివస్య ఇదం శైవమ్" (శివుని సంబంధమయినది) అను నిష్పత్తిచే శైవశబ్ద మేర్పడినది. భరతఖండమున వెలసిన మతములలో శైవము మిక్కిలి ప్రాచీనమయినది. ఇందులో సామాన్యశైవము, మిశ్రశైవము, పూర్వశైవము, శుద్ధశైవము, శ్రౌతశైవము, మార్గశైవము, వీరశైవము సామాన్యవీరశైవము, విశేష వీరశైవము, నిరాభారవీరశైవము అనిపది విధములగు అవాంతరభేదములు శివాగములలోవివరింపబడి యవి యుత్తరోత్తరముగ ఉత్తమఫలదాయకములని చెప్పబడినది. "శివ" శబ్దమువలెనే "లింగ" శబ్దముకూడ "లీనమర్థంగమయతి" అనగా సమస్త ప్రపంచము దేనియం దుదయించి మరల దేనియందు లయమొందుచున్నదోయది యను విశాలార్థముతో పరబ్రహ్మవాచకముగా వాఙ్మయములో వ్యవ

హృతమయినది. సూర్యునియందు తేజమువలెను, చంద్రుని యందు వెన్నెలవలెను, ఇచ్ఛాజ్ఞానక్రియాత్మకమగు నొక మహాశక్తి యవినాభావముగ అనగా ఎంతమాత్రము వేఱుగా విడదీయరాని విధముగా పరబ్రహ్మమగు శివునియందు గర్భిత మయి యున్నదనియు, ఇట్టి శక్తితోగూడి ప్రేరితుడయిన యా శివుడే సమస్తజగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు కారకు డగుచున్నాడనియు, ఆతనినుండి యుదయించిన జగత్తుకూడ నాతనివలె యథార్థమేగాని మిథ్యకానేరదనియు శివాగమము లందలి సిద్ధాంతమయియున్నది. శక్తివిశిష్టుడు కాని శివుడేపని ఎంతమాత్రము చేయజాలడు. "శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం। నచేదేవం దేవః నఖలుకుశలః స్పందితుమపి" అని శంకరాచార్యులుగూడ సౌందర్యలహరియను దేవీస్తోత్ర ము ప్రథమశ్లోకముబో మునుముందే యీ యర్థము ప్రతిపా దించియున్నారు. కావున శివశక్తులే జగజ్జనకులు. "వాగర్థావివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే జగతః పితరౌ వందే పార్వతీపరమే శ్వరౌ" అని కాళిదాస మహాకవిగూడ రఘువంశమహాకావ్యాది శ్లోకములో శబ్దము నర్థమువలె నేకముగ గలిసియున్న పార్వతీ పరమేశ్వరులే జగత్పితలనువిషయమును విశద మొనరించినాడు. శక్తిసమేతుడయినశివుని (పరబ్రహ్మము)యారాధనముసామా న్య శైవలోకములో కరచరణాదిరూపరహితమయిన స్థావర లింగరూపమున దేవాలయములందును, ఇష్టప్రాణభావలింగ రూపకముగ నిజదేహాత్మక దేవాలయముల (తమ దేహమే దేవా

లయమను భావనతో) వీరశైవ ప్రపంచమునను సనాతనకాల ముసుంచియు పరిపాటిగా జరుగుచున్నది. లింగచిహ్నములో పయినుండులింగము శివాత్మకమనియు దానినావరించియుండు పానవట్టము శక్త్యాత్మకమనియు వ్యవహారము. కాఁగా లింగము శివశక్తులిరువురకు గూడ ద్యోతకమగు చిహ్నమనియే భావింపదగును.

వీరశైవమునకు ప్రధానాంగము ఇష్ట లింగధారణము తత్పూజనము నయియున్నది. గురుడు హస్తమస్తక సంయోగ మొనర్చి, దీక్షాకాలమున జీవునియంటి యుండు ఆణవ, కార్మిక మాయామలములు మూడింటిని వేధా, మను, క్రియాత్మకమయిన దీక్షాత్రయముచే దగ్ధము గావించి భౌతిక శరీరమును లింగశరీరముగ మార్చి ప్రసాదించిన ఇష్టలింగమును వీరశైవుడు సర్వకాల సర్వావస్థలయందు ఎప్పుడునించుకేనియు నెడబాయక తనస్థూల శరీరమున శిరము, కంఠము, భుజము, వక్షము, కక్షమున్నగు నేస్థలములలో నయినను. నాభికి పయినుండు ప్రదేశమున ధరించి. సూక్ష్మకారణ శరీరముల నిక్షిప్తములయిన ప్రాణ భావలింగములతో (జ్యోతిర్లింగము) దానికి ఐక్యానుసంధానము నలవరించుకొనుచు పూజించుచుండవలెను. ఇష్టముల నొడగూర్చి యనిష్టముల పరిహరించునది ఇష్టలింగము. కావున ఏకేశ్వరోపాసనాత్మకమయిన ఇష్టలింగారాధనము తప్ప మఱి యేయితర దేవతాపూజాకర్మములను వీరశైవులాచరింపరాదు. దేవాలయములందలి స్థావరలింగపూజనములతో గూడ వారికే

మాత్రము నిమిత్తములేదు. శివజీవైక్యరూపకమయిన మోక్ష మొక్కటియే వారిప్రధానలక్ష్యము. "విశబ్దేనోచ్యతేవిద్యాశివజీవైక్యబోధినీ తస్యాంరమంతే యేశైవాః వీరశైవాఇతిస్మృతాః" "విశేషంరాతీతివీరః" "ఇత్యాదిగావీరశబ్దము నిర్వచింపబడినది. కావుననే వీరవ్రతము కులాంగనాసదృశమనియు, బహుదేవతారాధన రూపకములగు నితర వ్రతవిధానములు గణికాంగనా సదృశములనియు "ఏకేనజన్మనాముక్తిర్వీరాణాంతుమహేశ్వరి' (వీరవ్రతులకు ఒక్కజన్మముననే ముక్తిలభించును)అనియు శివాగమములలో చెప్పబడినది. సదాచారము, లింగాచారయ, శివాచారము, గణాచారము, భృత్యాచారము అను పంచాచారములును,భూతి,రుద్రాక్ష,మంత్రము, గురువు, లింగము, జంగమము (శివభక్తుడు=అతిథి) పాదతీర్థము, ప్రసాదము అనెడి అష్టావరణములును వీరశైవులకు విహితములయి యున్నవి. పరమలక్ష్యమయిన శివజీవైక్యసిద్ధి నందుటకయి తత్సాధనరూపకముగ భక్త, మాహేశ్వర, ప్రసాగి, ప్రాణలింగి, శరణ, ఐక్యములను షట్థ్సలము లేర్పఱుపబడినవి. కావుననే షట్థ్సల విధానవిజ్ఞానములు గూడ వీరశైవుల కావశ్యకములయి యున్నవి. సిద్ధాంతశిఖామణియను సంస్కృతగ్రంథమున నింకుగూర్చి విశేషవివరములు చెప్పబడియున్నవి. స్థలశబ్దముగూడ సమస్తసృష్టి స్థితిలయముల కాశ్రియమయినది అను నర్థముతో లింగశబ్దమువలెనే పరబ్రహ్మమయిన శివునకు వాచకముగా నిర్వచింపబడినది. సాధకుడు ఆత్మార్పణ మొనర్చి, తను మనోధనముల

యందు తగులము మాని యవి నిజగురునకు, శివభక్తులకు అధీనములని తలంచుబుద్ధిని హెచ్చరించునది భక్తస్థలము; "ఆత్మవత్సర్వభూతాని" అను న్యాయముతో సమస్తజీవరాశులను తనవలెనే భావించి, ఫలాపేక్ష రహితముగ కర్మలొనరింపదగు ఆవశ్యకతను హెచ్చరించునది మాహేశ్వరస్థలము; సమస్తపదార్థములనుముందు శివార్పణమొనర్చి, శివప్రసాదబుద్ధితో వానిని గ్రహించుచు, తానొనర్చు కర్మములన్నిటికి శివుడే కర్తయనియు, ఆతని ప్రేరణములేనిదే తాను చేయునదిలేదనియు తలంచెడి శివాధీనతను హెచ్చరించునది ప్రసాదిస్థలము; తనప్రాణము శివుని శక్తియేయని భావించి, మనస్సును ప్రాణలింగమందే లగ్నమొనరించుటను హెచ్చరించునది ప్రాణలింగిస్థలము. ఈస్థితిలో సాధకునకు శివయోగము (శివునితోకూడిక) చేకూరును; శివుడు పతియని, తాను సతినని, ఆతడు తక్క వేఱుశరణము (దిక్కు) లేదని యనన్యమగు సతీభావముతోడ శివునియెడ వర్తిల్లు స్థితిని హెచ్చరించునది శరణస్థలము; పూర్వోక్తములయిన పంచస్థల లక్షణములలో గడిదేరినంతనే సాధకునకు సమస్తము (తనతోసహితము) శివస్వరూపముగనే గోచరించునుగాని ఇంచుకేని భిన్నస్థితి మఱేమియు గాన్పింపదు. హారతియిచ్చిన కర్పూరమువలె సర్వదగ్ధమయి, స్వస్వరూపము నశించి శివైక్యము గలుగును. ఈదశను వివరించునదే ఐక్యస్థలము.

కావున క్రమసాధనవలన వీరశైవుడు శివైక్యసిద్ధిని

సాధింపవలసియున్నది. వీరశైవదీక్షితులకు భౌతికశరీరము లింగశరీరముగామాఱునని మున్నే వివరించితిని. కావున నిరంతరము మనస్సును, బుద్ధిని, ఇష్టప్రాణభావ లింగములయందే నిలిపి ధ్యానించుచు, నిష్కామబుద్ధితో తమకృత్యములన్నిటిని లింగమునకే యర్పించి, తమకర్మేంద్రియ, జ్ఞానేంద్రియములు లింగాధిష్ఠితములని భావించుచు, వారు తమ వ్యాపారములన్నియు లింగార్పిత మొనర్పవలయును. ఇట్లు సాధనచేయువారి చిత్తము చెడ్డపనులయెడ నేమియుచేరక శివునియందే హత్తియుండును. అందుచే నట్టివారికి పునర్జన్మముండక, శివజీవైక్యరూపకమయిన మోక్షము కరతలామలకమగును. ఈమతమునందు స్త్రీ పురుషు లిరువురకు సమానమయిన బాధ్యతలు అధికారములు ఉన్నవి. వీరశైవమునకు శివాద్వైతము, సిద్ధాంతశైవము. భేదా ఽ భేదసిద్ధాంతము, శక్తివిశిష్టాద్వైతము, అనునామములుగూడ వ్యవహృతములయియున్నవి. ఈచివరనామ మీ మతమునకుగలిగిన కారణమును, ఈమతతత్త్వమును వివరించుచు పంచాచార్య ప్రభాపత్రికాధిపతులు, గ్రంథమాలికా స్థాపకులు కీ॥ శే॥ శ్రీపండిత కాశీనాథశాస్త్రిగారు 1935 సంవత్సరమున మైసూరులో జరగిన తత్త్వశాస్త్రమహాసభలో కన్నడమున ఉపన్యాసమునొసంగి దానిని "శక్తివిశిష్టాద్వైత" సిద్ధాంతము అను పేరితో గ్రంథరూపమునగూడ తమగ్రంథమాలికలో ప్రకటించియున్నారు. దానికిదినబలో ఆంగ్లమునను, హిందీలోను అనువాదములు వెలువడినవి. కన్నడగ్రంథమునే ముఖ్యాధా

రముగాగొని యీక్రింది యనువాదమును ఆంధ్రవీరశైవుల యుపయోగమునకయి రచించుచున్నాను.

---

శక్తివిశిష్టాద్వైతమనగా శక్తివిశిష్టుడయిన జీవునకు, శక్తివిశిష్టుడయిన శివునకు ఇరువురకు సామరస్యమనియర్థము "శక్తిశ్చ శక్తిశ్చ శక్తీ తాభ్యాం విశిష్టౌ జీవేశౌ తయోః అద్వైతం శక్తివిశిష్టాద్వైతమ్" అని పూర్వాచార్యులు శక్తివిశిష్టాద్వైతపదమునకు వ్యుత్పత్తిని చెప్పియున్నారు. శక్తియనునది స్థూల చిదచిదాత్మకశక్తి. సూక్ష్మ చిదచిదాత్మకశక్తియని రెండువిధములు. జీవుడు స్థూలచిదచిదాత్మకశక్తితోగూడియున్నాడు. శివుడు సూక్ష్మచిదచిదాత్మకశక్తితో గూడియున్నవాడు. జీవునిస్థూలచిచ్ఛక్తి కించిద్జ్ఞత్వ (స్వల్పజ్ఞానముగలది) రూపకమయినది. స్థూలఅచిచ్ఛక్తికించిత్కర్తృత్వ (స్వల్పముచేయగల్గునది) రూపకమయినది. శివుని సూక్ష్మచిచ్ఛక్తి సర్వజ్ఞతా (సమస్తమెఱుంగుట) రూపకమయినది. సూక్ష్మఅచిచ్ఛక్తి సర్వకర్తృతా (సమస్తముచేయగల్గుట) రూపకమైనది. ఇట్లుక్రమముగ రెండువిధములయిన శక్తులు గలిగియుండు జీవునకు, శివునకుగల అద్వైతమే (సామరస్యము) శక్తివిశిష్టాద్వైతమని చెప్పబడును.

## శక్తివిచారము.

శక్తియనగా పరశివబ్రహ్మమునందు అవినాభావముగ స్వతస్సిద్ధముగనున్న విశేషణము. ఇట్టి విశేషణాత్మకశక్తితో

పరబ్రహ్మ స్వాభావికముగనే విశిష్టుడయి (కూడి) యున్నాడు. శక్తిరూపకమయిన యిట్టి యవినాభావ విశేషణముతో గూడి యున్న బ్రహ్మముయొక్క తత్త్వమును ప్రతిపాదించుట యే శక్తివిశిష్టాద్వైత సిద్ధాంతమందలి రహస్యము-పరశివ బ్రహ్మ మునందిట్టు లేర్పఱుపరాని విధముగా విశిష్టమయి యుండుటచే ఈశక్తి నిత్యము. శాశ్వతము నయినదని గణింపవలెను.

శ్వేతాశ్వతరోపనిషత్తునందలి
"పరాఽస్యశక్తిర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ
జ్ఞానబలక్రియాచ" (౬-౮)

అను మంత్రమునం దీ విషయము నిరూపితమయి యున్నది-ఈమంత్రముయొక్క యర్థమును బాగుగా విచారించినచో పరబ్రహ్మము నందలి శక్తి స్వభావసిద్ధమయినదనియు, అది జ్ఞానశక్తి, క్రియాశక్తి మొదలగు రూపములతో నానావిధముల వఱలుచున్నదనియు, స్పష్టమగును. "స్వాభావికీ" అనుపదము యీ శక్తియొక్క నిత్యత్వమును ఘంటాపథముగ నుద్బోధించు చున్నది. ఈయుపనిషత్తునందే మఱియొక మంత్రము.

"తేధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మ శక్తిం
స్వగుణైర్నిగూఢాం । యః కారణాని నిఖిలానితాని
కాలాత్మయుక్తాన్యధితిష్ఠ త్యేకః" (౧-3)

అనునది యీశక్తి పరశివ బ్రహ్మమునందు బహుగోప్యము

గాగర్భితమయి యున్నదని బోధించుచు జాని నిత్యత్వమును బాహాటముగా ప్రకటించుచున్నది.

ఈ విషయమునే యీ యుపనిషత్తునందు మఱొకయెడనున్న

"యదాతమ స్తన్నదివా న రాత్రి ర్నసన్న చాసచ్ఛివ ఏవ కేవలః । తదక్షరం తత్సవితుర్వరేణ్యాం, ప్రజ్ఞాచ తస్మాత్ ప్రసృతాపురాణీ (౪-౧౮)"

అనుమంత్రము గూడ సమర్థించుచు, పురాణీ=అనాది సంసిద్ధ మయిన—ప్రజ్ఞా=చిచ్ఛక్తి, ఆపరశివ బ్రహ్మమునుండి ప్రసరించి క్రియాశక్తి మొదలగు అనంతరూపములతో వెలువడుచున్న దని బోధించుచున్నది. ఈ యుపనిష ద్వాక్యమునందు శక్తి విలాసము విస్పష్టముగ ప్రకటితమగుచున్నది. మఱియు నీ యుపనిషత్తునందలి

"మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరం। తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్"(౪-౧౦)

అనుమంత్రము గూడ పరమాత్మ శక్తివిశిష్టుడని బోధించు చున్నది. పూర్వాచార్యులు మాయాశబ్దమునకు "మం-శివం-అయతి-స్వభావతః ప్రాప్నోతీతి మాయా" అని సమాస విగ్రహముగావించి యర్థము చెప్పియున్నారు-అందుచే, ఈ మాయ సర్వాద్వైతవాదులు చెప్పునట్లు మూలాఽవిద్యా రూపక మాయగాక విమర్శశక్తి రూపక మాయయని గ్రహిం పదగును. పయి మంత్రాభిప్రాయమునే సిద్ధాంతాగమ మందలి

"మం శివం పరమం బ్రహ్మప్రాప్నోతీతి స్వభావతః
మాయేతి ప్రోచ్యతేలోకే బ్రహ్మనిష్ఠాసనాతనీ"

అను శ్లోకము బోధించుచున్నది.
యజుర్వేద తైత్తిరీయ సంహితయు

"ఆఖుస్తేరుద్ర పశుస్తం జుషస్వైష తేరుద్ర
భాగః సహ స్వసాంబికయా తం జుషస్వ" (౧-౮-౬)

అనుశ్లోకమున శక్తినిత్యత్వమును ప్రతిపాదించుచున్నది. ఇందలి "స్వసా-అంబికయా" అనుపదములను పర్యాలోచించినచో, పరమాత్మయందు శక్తి స్వాభావికముగనే నిరూఢమయి యున్నట్లు స్పష్టమగుచున్నది.
"నమః సోమాయచరుద్రాయచ"

(యజుర్వేదతైత్తిరీయ సంహిత ४-౫-౮)

అను శ్రీరుద్రమంత్రముగూడ పరమేశ్వరుడు ఉమారూపక శక్తియుక్తుడని బోధించుచున్నది. ఈ యభిప్రాయమునే కైవల్యోపనిషత్తునందలి.

"తమాదిమధ్యాంతవిహీన మేకం విభుం చిదానంద
మరూపమద్భుతం। ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం
త్రిలోచనం నీలకంఠం ప్రశాంతం। ధ్యాత్వా మునిర్గచ్ఛతి
భూతయోనిం సమస్త సాక్షిం తమసః పరస్తాత్" (౧-౭)

అనుశ్లోకము సమర్థించుచున్నది. ఇట్టులే యనేకశ్రుతివాక్యములు శక్తియొక్క నిత్యత్వమును శివసమేతత్వమును ప్రతిపాదించుచున్నవి. సిద్ధాంత శిఖామణిలో,

"తదీయా పరమాశక్తిః సచ్చిదానంద లక్షణా ।
సమస్తలోకనిర్మాణ సమవాయస్వరూపిణీ ।
తదిచ్ఛయాఽభవత్సాక్షాత్తత్స్వరూపానుకారిణీ"

(పరిచ్ఛేదము ౧-౭)

విమర్శాఖ్యా పరాశక్తిర్విశ్వ వైచిత్ర్యకారిణీ ।
యస్మిన్ ప్రతిష్ఠితా బ్రహ్మతదిదం విశ్వభాజనం । (33)
అంతఃకరణరూపేణ జగదాకార రూపతః ।
యస్మిన్ విభాతి చిచ్ఛక్తి ర్బ్రహ్మభూతః స ఉచ్యతే (3४)
యథాచంద్రే స్థిరాజ్యోత్స్నా విశ్వవస్తుప్రకాశినీ ।
తథాశక్తి ర్విమర్శాఖ్యా ప్రకాశే బ్రహ్మణిస్థిరా (3५)

(పరిచ్ఛేదము-౨౦)

అనుశ్లోకములలోను సచ్చిదానంద లక్షణమైన పరాశక్తి సమస్తలోక నిర్మాణమున కయి పరశివునియందు సమవాయ సంబంధముతో నుండి, ఆతని యిచ్ఛానుసారముగ కేవల మాతని స్వరూపమే యగుచున్నదనియు, చిత్రవిచిత్రమైన విశ్వసృష్టిని నిర్మించు విమర్శనామక పరాశక్తి యెవనియందు ప్రతిష్ఠితమయి యున్నదో, ఆబ్రహ్మమే విశ్వభాజనమని చెప్పబడుననియు, చిచ్ఛక్తి మూలాఽహంకార రూపముతోను, జగదాకారరూపముతోను ఎవనియందు ప్రకాశించుచున్నదో ఆతడే పరబ్రహ్మ నామక పరశివుడని పేర్కొనబడుననియు సమస్త వస్తువులను ప్రకాశింపజేయు చంద్రిక చంద్రుని యందెట్లు స్థిరముగ వెలయుచున్నదో యట్లే విమర్శనామకమైన పరా

శక్తి ప్రకాశ స్వరూపముతో పరబ్రహ్మమునందు స్థిరముగా నిలిచియున్నదని పరిస్ఫుటముగా శక్తి స్వరూపము ప్రతిపాదిత మయి యున్నది.

జగద్విఖ్యాతినందిన కాళిదాస మహాకవియు తన రఘు వంశ మహాకావ్యారంభమున.

"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే,
జగతః పితరౌవందే పార్వతీ పరమేశ్వరౌ"

అని మంగళాచరణమొనర్చి యామంగళ శ్లోకములో పార్వతీ పరమేశ్వరు లిరువురు శబ్దార్థములవలె నిత్యమయిన యన్యోన్య సంబంధమును గలిగి యున్నారని ప్రకటించినాడు. పార్వతి యన శక్తియనియు పరమేశ్వరుడన శివుడనియు నర్థము. శబ్దమును విడిచి యర్థము, అర్థమును విడిచి శబ్దము, ఎట్లుండ జాలవో యట్లే శివునివిడిచి శక్తియు, శక్తిని విడిచి శివుడును లేరని యామహాకవి యభిప్రాయమయి యున్నది.

వీరశైవ సిద్ధాంతమునందు శివునకు శక్తికి అవినాభావ సంబంధము(సమవాయ సంబంధము) చెప్పబడినది. విడదీయరాని నిత్యసంబంధమే, సమవాయ సంబంధమని గణింపబడును. సూర్యునియందు ప్రభ, చంద్రునియందు వెన్నెల, అగ్నియందు దహనశక్తి, సముద్రమందు సౌభాగ్యము. పూవునందు తేనె, చక్కెరయందు తీపి, అవినాభావముగ నెలకొని యున్నట్లే శివునియందు శక్తి యవినాభావముగ నున్నది. ఈవిషయమే.

"సా మమేచ్ఛా పరాశక్తి రవియుక్తా స్వభావజా ।
వహ్నేరూష్మేవ విజ్ఞేయా రశ్మిరూపా రవేరివ॥
సర్వస్యజగతో వాపి సాశక్తిః కారణాత్మికా"

అనుశ్లోకములో మృత్యుంజయ భట్టారకమను కృతి యందు గూడ నుదాహృతమయినది.

వీరశైవ సిద్ధాంతములో శక్తికి శక్తి సహితపదార్థములకు భేదాఽభేదములు చెప్పబడినవి.

"ఏషాశక్తిః శివాహ్యే తచ్ఛక్తిమానుచ్యతే శివః
శక్తి శక్తిమతోర్భేదం వదంతి పరమార్థతః
అభేదం చానుపశ్యంతి యోగినస్తత్త్వ చింతకాః"

అను కూర్మపురాణ వాక్యానుసారముగ శివశక్తులకు పారమార్థికముగ భేదాఽభేదము లుగ్గడిపింపబడినవి. వీరశైవసిద్ధాంతమున బ్రహ్మము నిర్విశేషముగాక. సవిశేషమయి యున్నది. పరశివ బ్రహ్మము శక్తి విశిష్టమయిన కారణమున సవిశేషమనియే యెన్నదగును. బ్రహ్మము సవిశేష మగుటవలననే చరాఽచరాత్మక మయిన జగదుత్పత్తికి కారణ మగుచున్నది-శక్తి విశిష్ట బ్రహ్మమునుండి యుత్పన్నమవుటచే జగత్తుకూడ శక్తి విశిష్టమే యగుచున్నది. మనము ప్రపంచమందలి యేపదార్థమును గాంచినను దానిలో నొక్కొక్కదాని యందొక్కొక్క విధమయిన శక్తి యుండుట కనులార గాంచుచున్నాము. పృథివియందు ధారణశక్తి, జలమునందు ఆప్యాయనశక్తి, తేజస్సునందు ఉజ్జ్వలనశక్తి,

వాయువునందు స్పందన(చలన)శక్తి, ఆకాశమునందు వ్యాపన శక్తి, ఆత్మయందు బుద్ధిశక్తి కలవని కనుగొందుము గదా ! అంతియేగాక వృక్షాదులయందు జలాకర్షణాది శక్తులును, అగ్ని మున్నగువానియందు దహనాదిశక్తులును, ఓషధుల యందు పెద్దపెద్ద రోగములు నివారించుశక్తులును, పాదరస మున రాగిని బంగారముగ మార్చుశక్తియు, వజ్రమున శిల లను భేదించుశక్తి, మణిమంత్రాదులలో విషములు భూతప్రేత పిశాచాదికములువలన గలుగుబాధలను పరిహరించుశక్తులును, ధ్వన్యాకర్షకయంత్రము (రేడియో)నందు ధ్వని నాకర్షించి విస్తరించుశక్తియు విద్యుత్తు (ఎలెక్ట్రిసిటి)నందు బహుయంత్ర ముల నడిపించుశక్తియు, సూదంటుఱాయియందు సూది నాక ర్షించు శక్తియు, చీమలయందు చెట్ల మొదళ్ళను వాసన చూచినంతమాత్రమున చెట్ల చిట్టచివరనున్న పండ్లను పసిపట్టి గ్రహించుశక్తియు, ఒకజాతి కోతులలో విషమును పరీక్షించు శక్తియు, ఒంటెయందు శ్వాసద్వారమున సర్పముల నాక ర్షించు శక్తియు- ఇట్లే బ్రహ్మసృష్టియందలి సమస్త పదార్థ ములందు ఒక్కొక్క విధమయిన శక్తి సహజముగా గలదను సంగతి ప్రతిమానవునకు అనుభవపూర్వకముగ తెలియు చున్నది. ఇందువలన సకలచరాచరాత్మకమయిన ఈజగత్తు శక్తివిశిష్టమయి యున్నదనియు, ఇంత శక్తివిశిష్టమయిన జగమ్మును నిర్మించిన బ్రహ్మము అర్థతః శక్తివిశిష్టమయినదే యనియు, అందఱకు అనుభవసిద్ధముగ విదితముగాక మానదు.

సచ్చిదానంద (సత్ - చిత్ - ఆనంద) రూపకమయిన బ్రహ్మము, "అస్మి; ప్రకాశే; నందామి" అనగా "నేను ఉన్నాను; ప్రకాశించుచున్నాను; ఆనందించుచున్నాను." అనెడి అనుభవముతో కూడియేయున్నది. ఈయనుభవమే పరబ్రహ్మ మందలి విమర్శశక్తి. ఆయనుభవము పరబ్రహ్మమునందు లేదనుపక్షమున, ప్రకాశరూపకమయిన స్ఫటికశిలవలెనే యీ పరబ్రహ్మము జడపదార్థమని చెప్పవలసిన యసంగతప్రసంగము సంభవించును. అందకాడగు అంధునకు తన చక్కదన మెఱుంగుశక్తిలేనికతమున, ఆతని సౌందర్యము నిరర్థకమగు నట్లే పరబ్రహ్మమునకు తన సచ్చిదానందస్వరూపమును తెలియు శక్తిలేదన్నచో నాతని యందున్న యీసచ్చిదానంద స్వరూపములు వ్యర్థములనియే చెప్పదగునుగదా? కావున పరబ్రహ్మ మందలి సచ్చిదానందరూపానుభవశక్తి నందఱు నంగీకరింపక తప్పదు. ఇందువలన పరబ్రహ్మము శక్తివిశిష్టుడనుట సిద్ధము కాగలదు. పరబ్రహ్మమందు నిష్ఠితమయియున్న విమర్శశక్తియే సూక్ష్మచిదచిదాత్మకశక్తియని యెన్నఁదగును. ఈసూక్ష్మచిద చిదాత్మకశక్తివిశిష్టపరబ్రహ్మమే 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' 'చైతన్యమాత్మా' మున్నగు బ్రహ్మసూత్ర, శివసూత్రమయ వేదాంతశాస్త్రములందు ప్రతిపాదితమయియున్నది. సిద్ధాంత శిఖామణియందు,

"గుణత్రయాత్మికాశక్తిర్బ్రహ్మనిష్ఠా సనాతనీ" పరిచ్ఛేదము ౨(36)

అని శ్రీజగద్గురు రేణుకాచార్యులు చెప్పినట్లు విమర్శ

శక్తి, బ్రహ్మనిష్ఠము సనాతనమునయియున్నది. మయూరాండరసన్యాయమున (అనగా నెమిలిగ్రుడ్డునందలి రసములో ముందుపుట్టబోవు నెమిలియొక్క పాదము, రెక్క, మున్నగు అవయవములందు గానవగు వేర్వేఱువర్ణములు అణగియున్నట్లు) ఈవిమర్శశక్తిలో సకలచరాచరాత్మకమయిన జగత్తు గర్భితమయియున్నది. చరాచర విశ్వాత్మకమయిన యీవిమర్శశక్తి తన విభాగపరామర్శదశయందు సత్త్వ, రజస్తమోగుణరూపములు గలదియగుచున్నది. ఆవిమర్శశక్తియంశమునందు, ఉత్తమకర్తృత్వవినిర్ముక్తజ్ఞానాంశముచే సత్త్వగుణాత్మకమయిన విద్యాశక్తి యుత్పన్నమగుచున్నది. ఉత్తమజ్ఞాతృత్వవినిర్ముక్త క్రియాంశమువలన ఇంచుక సత్త్వతమోగుణమిశ్రితమయిన రజోగుణశక్తి యుత్పన్నమగుచున్నది. జ్ఞానక్రియలు రెండింటికి స్వాభావికముగ ఐక్యమున్నను, సృష్టిదశయందు జ్ఞానక్రియాశక్తులు పరస్పరవిభాగము నొందుటచే "జ్ఞానంక్రియానభవతి క్రియాజ్ఞానంనభవతి" అనగా జ్ఞానముక్రియ కాదు. క్రియజ్ఞానముకాదు. అనెడి భేదబుద్ధిరూపకమయిన తమోగుణశక్తి యుత్పన్నమగుచున్నది.

ఈతమోగుణశక్తియే జడమయిన మాయగా చెప్పబడుచున్నది. సూర్యకిరణము సూర్యకాంతశిలపయిబడి తత్ప్రతిస్ఫురణ (తిరస్కరణ) గతిచే అగ్నికణరూపమునొంది ప్రక్కనుండు దూదినిచేరి యగ్నియొక్క యాకారమును ధరించునట్లే. శివుని విమర్శశక్తి జడమయిన మాయాశక్తిని ప్రతిస్ఫురణ

గతితో ప్రవేశించి, సుఖదుఃఖమోహాదికకారకమగు సత్త్వరజస్తమోగుణాత్మకప్రకృతిగా పేర్కొనబడుచున్నది. ఈ ప్రకృతికే వీరశైవాచార్యులు "చిత్తము" అను పేరుపెట్టిరి. ఈ చిత్తశక్తివిశిష్టమయిన శివప్రకాశరూపశివాంశమే జీవుడని వ్యవహరింపబడును.

## జీవాత్మ విచారము.

అనాద్యవిద్యాసంబంధాత్తదంశో జీవనామకః 36 సి॥శి॥ది ౫.

అని శ్రీరేణుకాచార్యులు చెప్పినట్లు జీవుడు శివాంశస్వరూపుడయి యున్నాడు. ఈయభిప్రాయమునే "అంశోనానావ్యపదేశాత్" అను బ్రహ్మసూత్రముగూడ సమర్థించుచున్నది. ముండకోపనిషత్తునందలి

"యథాసుదీప్తాత్ పావకాత్ విస్ఫులింగాః సహస్రశః
ప్రభవంతే సరూపాః తథాఽక్షరాద్వివిధాః సోమ్యభావాః
ప్రజాయంతే తత్రచైవాపియంతి (౨-౧-౧)".

అను మంత్రమునుబట్టికూడ, అగ్నినుండి తదంశరూపములయిన కణము లసంఖ్యాకములుగ నెట్లువెలువడునో యట్లే పరబ్రహ్మమునుండి తదంశములేయైన జీవకోటు లనంతముగా నావిర్భవించి మరల లయమొందునని స్పష్టమగుచున్నది.

వీరశైవ సిద్ధాంతములో శివునకు జీవునకు పారమార్థికమగు భేదాఽభేదమంగీకృతమయినది. అగ్నినుండి యుద్భవించిన యగ్నికణములకు అగ్నికి అత్యంతమయిన భేదమును

గాని యత్యంతమయిన యభేదమునుగాని చెప్పరానివిధము ననే, శివునినుండి యుత్పన్నములయి శివాంశములుగ గణింప బడు జీవులకు శివునకుఁగూడ అత్యంతమయిన భేదమునుగాని అత్యంతమయిన యభేదమునుగాని చెప్పవలనుపడదు. అందు చేత భేదా ౽ భేదమునుమాత్రమే చెప్పవలసియున్నది. అంశ మునకు తత్కారణమయిన అంశికి అత్యంతమయిన యభేద మును చెప్పునెడల అగ్నివలన జరగు పాకాదిక్రియలు (వంట మొదలగుపనులు) అగ్నికణమాత్రమువలనగూడ నెఱవేఱవల యునుగదా? అట్లుజరుగకుండుట యందఱెఱింగినదే? అత్యంత మయినభేదమునే చెప్పెడిచో, అగ్నికంటె అత్యంతభిన్నము లయిన జలాదికములందు గనరాని దహనశక్తి వానియందు వలెనే అగ్నికణమునందుగూడ పూర్తిగలేదని చెప్పనగును. కాని యట్లుచెప్పఁగలమా? నలుసంతనిప్పు దూదిరాశిమీద పడినచో దానిని దహించి పెద్దమంటయగుట లోకప్రసిద్ధము. ఇట్లే శివునకు తదంశజనితులైన జీవులకు అత్యంతమయిన అభే దమును చెప్పెడిచో శివునియందున్న సర్వజ్ఞత్వ సర్వకర్తృత్వ శక్తులు జీవులకుగూడగలవని చెప్పవలసివచ్చును. అత్యంత మయిన భేదమును చెప్పెడిచో శివునికంటె భిన్నములయిన ఘటపటాదులకులేని జ్ఞానరూపకక్రియలు జీవులకుగూడ లేవని చెప్పనగును. జీవులకు ఘటపటాదివస్తుజ్ఞానము గలదని యెల్ల రెఱింగినదే. కావుననే వీరశైవాచార్యులు శివునకు జీవునకు భేదా ౽ భేదమును (కొంతవఱకు భేదము మఱికొంతవఱకు

అభేదము) అంగీకరించిరి. ఇందుచేతనే వీరశైవమతమునకు భేదాఽభేద సిద్ధాంతము, ద్వైతాఽద్వైత సిద్ధాంతము. అను నామాంతరములుకూడ కలిగినవి.

"ద్వాసుపర్ణాసయుజాసఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే". (చక్కని ఱెక్కలుగల పక్షులు రెండు కూడి మాడి నెచ్చెలుల వలె ఏకవృక్షమును సమానముగా నాశ్రియించియున్నవి). మున్నగు కొన్ని శ్రుతివాక్యములు స్థూలదృష్టికి కేవలము ద్వైతప్రతిపాదకములుగా గోచరించును.

"తత్త్వమసి" (అదియ నీవు)"అహంబ్రహ్మాస్మి"(నేను బ్రహ్మమును) 'నేహనానాస్తికించన' (ఇక్కడ నానావిధత్వ మొక్కింతయు లేదు) మున్నగు మఱికొన్ని వాక్యములు కేవలము అద్వైతప్రతిపాదకములుగా గాన్పించును. కావున నిట్టి ద్వివిధ వాక్యములకు సుగమమార్గమున సామంజస్యమును సమర్థించుట వేదప్రామాణ్య మంగీకరించు వైదికమతానుయాయులకు ముఖ్యకర్తవ్యమయి యున్నది. కావున వీరశైవమతాచార్యులిట్టి సుగమమార్గమునే యనుసరించుటచే వీరశైవ సిద్ధాంతము సర్వశ్రుతి సమ్మతమని వ్యవహృత మగుచున్నది.

ఈవిషయమునే వీరశైవమతభాష్య కర్తయయిన శ్రీపతిపండితులు తాము రచించిన శ్రీకరభాష్యములో

"ద్వైతాఽద్వైతమతేశుద్ధే విశేషాద్వైత సంజ్ఞకే
వీరశైవైక సిద్ధాంతే సర్వశ్రుతి సమన్వయః".

అని యుగ్గడించియున్నారు. ఇందుచే వీరశైవమతము భేదా ఽ భేదాత్మకమని యేర్పడుచున్నది తథాస్తు (అట్లే యగుగాక).

పరశివునందు అవినాభావ సంబంధముతోనున్న విమర్శశక్తి సత్త్వరజస్తమోగుణ తారతమ్యమూలమున పరిశుద్ధ చిద్రూపుడయిన పరశివునందు భోక్తృ, భోజ్య, ప్రేరకరూపక పరిణామముల నొందుచున్నది. ఇంచుక సత్త్వరజోగుణరూపకమయిన జీవచైతన్యము 'భోక్త' అని చెప్పబడును. అత్యంత తామసోపాధివిశిష్టమయిన చైతన్యము రసాదిరూపకమగు "భోజ్య" మని చెప్పబడును. పరతత్త్వరూప శుద్ధసత్త్వగుణోపాధివిశిష్టబ్రహ్మచైతన్యమయిన మహేశ్వరుడు "ప్రేరకు" డని చెప్పబడును. మాయోపాధియు శుద్ధము, అశుద్ధము, అని యిరుతెఱగులుగానున్నది. శుద్ధోపాధిరూపకపరామాయ శివుని ఆశ్రయించుకొనియుండును. కాని యది యాతనికి మోహమును గలిగింపజాలదు. దీనినే "ఊర్ధ్వమాయ" అని వ్యవహరింతురు. అశుద్ధోపాధిరూపకమయిన అవిద్య జీవుని ఆశ్రయించుకొనియుండి యాతనికి మోహమును గలిగించును. దీనినే అధోమాయ (ప్రకృతి) అని వ్యవహరింతురు. అవిద్యాశక్తిభేదమువలన జీవుడు నానాప్రకారవికారములకు లోనగుచున్నాడు. అవిద్యచే మోహితుడయిన జీవుడు. "అహంబ్రహ్మాస్మి" యనెడి తాదాత్మ్యజ్ఞానమునుండి దూరుడగుచున్నాడు. శివాంశసంభూతుడయ్యు జీవుడు కించిజ్జ్ఞుడు, కించిత్క

ర్తృత్వ కించిత్ శక్తి సమన్వితుడు, అనాదికర్మరూప విద్యా మోహితుడు, బ్రహ్మైక్యజ్ఞానవిరహితుడు, ఘోరా ఽ పార నిస్సార సంసారతాపత్రియానలదంగహ్యమానుడు, జననమర ణాన్వితుడు, బద్ధుడు అగుచున్నాడు.

"వాలాగ్రశతభాగస్య శతధాకల్పితస్యచ
భాగోజీవః సవిజ్ఞేయః సచానంత్యాయకల్పతే"
(శ్వేతాశ్వతరోపనిషత్తు ౫-౮).

అను ప్రిమాణముననుసరించి జీవాత్మ, వాలాగ్రము (తలవెంట్రుకచివర) యొక్క సహస్రాంశ (వేయవభాగము) మంత సూక్ష్మాకృతితో సమస్తప్రాణులహృదయములందు దీప మువలె వెలుగుచుండును. చిన్నదివ్వెయైనను ఇంటిలోపల నెచ్చటనున్నను ఇల్లంతటికి ప్రకాశమును గలిగించునట్లు, జీవాత్మ హృదయస్థానమందున్నను తన జ్ఞానప్రభవలన శరీర మంతటను వ్యాపించి సర్వావయవములందలి సుఖదుఃఖము లను తాననుభవించుచుండును. అణురూపకమయిన జీవాత్మ సమస్తప్రాణుల యంతఃకరణముల నాశ్రియించికొని ఆణవాది మలత్రియ సంబంధమువలన ప్రాక్తనకర్మపాశబద్ధమై యుం డును. స్వాభావికముగ జీవాత్మ శరీరరహితమయ్యు మాయా మయ శరీరమునందుండుటచే జననమరణరూపక సంసారచక్రి మున బండిచక్రిముయొక్క యంచువలె నెల్లప్పుడు తిరుగుచుం డును. శుద్ధస్ఫటికమునకు ప్రక్కనుండు జపాకుసుమంపు(దాసాని పువ్వు) సంపర్కమువలన ఎఱుపురంగుకలుగునట్లు, అహంకార

సంబంధమువలన జీవాత్మకు దేహాత్మాభిమానము ప్రాప్తమగును. శరీరరహితమయిన జీవాత్మకు స్వాభావికముగ దేహసంబంధములేదు. కాని యది యజ్ఞానకర్మ సంబంధమూలమున కర్మఫలము ననుభవించుటకయి నానాశరీరములు గలదియగుచుండును, ఆత్మ దేవుడుకాడు, గంధర్వుడుకాడు, యక్షుడుకాడు. రాక్షసుడుకాడు. మనుష్యుఁడుకాడు. పశుపక్ష్యాదిరూపకతిర్యక్ప్రాణియునుకాడు. కాని యాయాశరీర సంబంధముల చేత, ఆయాపేర్లతో వ్యవహృతమగుచుండును. జీవుడు దేవ, మనుష్య, పశు, పక్షి, జలచర, కృమి, కీటాదికములగు ఎనుబదినాలుగులక్షల జీవరాసుల యోనులందు జనించుటకు, వానియందు గలుగు సుఖదుఃఖముల ననుభవించుటకు అతనికర్మమే మూలకారణమయియున్నది. కర్మయంత్రి నియంత్రితమయిన సంసారచక్రమునందు జీవుడెట్లు పరిభ్రమించుచున్నను, పరమేశ్వరుడాతనికి హితమార్గ ముపదేశించి, పునర్జన్మరహితమగు మోక్షమార్గమును తోపింపజేయుచుండును. జీవుడు తనకర్మపరిపాకమువలన, అనాదిమలవాసనను పోనడంచి శివప్రసాదమునంజేసి శివస్వరూపుడయి శివునియందు సామరస్యము (ఐక్యము) నొందును.

## తత్త్వవిచారము.

"ఏకమేవా ఽ ద్వితీయం" 'సత్య ఽమనంతం బ్రహ్మ' సర్వంఖల్విదంబ్రహ్మ "ప్రజ్ఞాన బ్రహ్మ" మొదలగు శ్రుతి ప్రమాణముల ననుసరించి, అద్వితీయము, సచ్చిదానందస్వ

రూపము, సత్యము, నిత్యము, సకలచరాచర ప్రపంచస్వరూప
ము, ఆద్యంతరహితము, ఉపమాతీతము, సర్వశక్తి సమన్వితము
అయిన పరబ్రహ్మమునందు అవినాభావ సంబంధముతో
నున్న విమర్శశక్తియొక్క స్ఫురణమే శివుడు, శక్తి, సదా
శివుడు, ఈశ్వరుడు, శుద్ధవిద్య, మాయ, కల, విద్య, రాగము,
కాలము, నియతి, పురుషుడు, ప్రకృతి, బుద్ధి, అహంకారము,
మనస్సు, శ్రోత్రము (చెవి). త్వక్కు (చర్మము), నేత్రము,
జిహ్వా,ఘ్రాణము (ముక్కు), వాక్కు, పాణి, పాదము, పాయువు,
ఉపస్థ, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము, ఆకా
శము, వాయువు, అగ్ని, జలము, పృథివి, అనెడి ముప్పది
యారు తత్త్వములరూపములతో పరిణమించుచున్నది.

శక్తివిశిష్టుడయిన పరశివబ్రహ్మము 'బహుస్యాం ప్రజా
యేయ' అను ఛాందోగ్యోపనిషద్వాక్యాభిప్రాయానుసారముగ
సృష్టిగావించుటకై ఉన్ముఖుడయినప్పుడు, అతనియందు నెల
కొనియున్న విమర్శశక్తియే ఇచ్ఛాశక్తిరూపముగ పరిణమిం
చుచున్నది.

"అనాదినిధనాచ్ఛాంతాచ్ఛివాత్ పరమకారణాత్
ఇచ్ఛాశక్తిర్వినిష్క్రాంతాతతోజ్ఞానం తతఃక్రియా
తత్రోత్పన్నానిభూతానిభువనాని చతుర్దశ''.

అను శివాగమప్రమాణానుసారముగ, ఉత్పత్తి, నాశము
లేనిది, పరమకారణము, శాంతము, అయిన పరశివబ్రహ్మము
నుండి మొదట ఇచ్ఛాశక్తి, దానినుండి జ్ఞానశక్తి, క్రియాశక్తి

ఉత్పన్నమయినవి. ఆయిచ్ఛాశక్తికి, జ్ఞానశక్తి యంతరంగము గను, క్రియాశక్తి బహిరంగముగను ఉండును. పరశివబ్రహ్మము జ్ఞానశక్తితోకూడినప్పుడు అతనికి "నేను సర్వజ్ఞుడను" అనెడి యభిమానమేర్పడును. అదియే "శివతత్త్వము" అని యెన్న బడును. సాలెపురుగు తానల్లిన తంతుజాలమునకు నిమిత్తకా రణమయినట్లే ఈశివతత్త్వాత్మక పరబ్రహ్మమే జ్ఞానాది విశిష్ట తాకారముచే, ముందుద్భవించు చరాచర ప్రపంచమునకెల్ల నిమిత్తకారణమగును.

పరశివబ్రహ్మము క్రియాశక్తితోకూడినప్పుడు అతనికి 'నేను సర్వకర్తను' అనెడి యభిమానమేర్పడును. అదియే 'శక్తితత్త్వము' అని యెన్నబడును. సాలెపురుగు తంతుజాలో త్పత్తికి యోగ్యమయిన శరీరవిశేషవిశిష్టతాకారముచే, ఆతం తుజాలమునకు ఉపాదాన (ముఖ్య) కారణమయినట్లే, ఈశక్తి తత్త్వాత్మకపరబ్రహ్మమే అనంతశక్తివిశిష్టతాకారముచే ముం దుద్భవించు చరాచర ప్రపంచమునకెల్ల ఉపాదానకారణ మగును.

పరశివబ్రహ్మమొకటియే ప్రపంచమంతటికి అభిన్న నిమిత్తోపాదానకారణరూప మగుననెడి యీ విషయమునే 'యథోర్ణనాభిః సృజతేగృహ్ణతేచ' (ఎట్లుసాలెపురువు సృజించి మరల తనయందడగించునో) అను దృష్టాంతపూర్వక వాక్యము నుదాహరించి ముండకోపనిషత్తు నిరూపించుచున్నది.

పైనిచెప్పిన శక్తితత్త్వమే ఇచ్ఛాశక్తికి అంతరంగమైన జ్ఞానశక్తికి ఉద్రేకము కలిగినపుడు దానిలో ప్రవేశించిః నీటిలో నానియుండి పైకి ఉబుకునట్టి బీజముయొక్క మొనవలె బహిర్గతమగును. ఈ విధమయిన యుద్రిక్తజ్ఞానశక్తిని గర్భమునుగప్పి యుండు తోలుసంచివలె ఆవరించి "అహమిదమ్ (నేను ఈ ప్రపంచమను) అనెడి యభిమానమొందునదే "సదాశివతత్త్వ" మని యెన్నబడును.

ఈ శక్తితత్త్వమే ఇచ్ఛాశక్తికి బహిరంగభూతమై ఉద్రేకదశ నొందియుండు క్రియాశక్తియందు ప్రవేశించి. సుక్షేత్రమున విత్తిన మంచి విత్తనమువలె అంకురావస్థను చెందు "ఇదమ్" (ఇది) శబ్దవాచ్యమయిన ప్రపంచమును "అహమిదమ్"(నేను ఈ ప్రపంచ స్వరూపమను) అని యభిమానించునదే "ఈశ్వరతత్త్వ" మని యెన్నబడును. సాగరతరంగన్యాయమువలె అనఁగా సముద్రమునకు దాని కెరటములకు భేదములేని విధమున "అహమిదమ్" అనెడి యహంకారమునకు, "ఇదమ్" అనెడిప్రపంచమునకు ఉన్న అభేదజ్ఞానమే 'శుద్ధవిద్యాతత్త్వ' మని యెన్నబడును.

ఇంతకుముం దుదాహరింపబడిన మయూరాండరస న్యాయమున (నెమిలిగ్రుడ్డులోని రసమునందు ముందు పుట్టబోవు నెమిలియొక్క కాళ్ళు, ఱెక్కలు మున్నగు వేర్వేఱు అవయవములందు కలుగు చిత్రవిచిత్రములయిన వన్నెలు విభాగరూపమొందని సూక్ష్మరూపమున ఇమిడియుండునట్లు) ఈ శుద్ధ

విద్యాతత్త్వమే తనయందు దడగియున్న భావి (ముందుదయించు) చరాచర ప్రపంచ నిర్మాణకారణములగు సూక్ష్మపదార్థములందు అన్యోన్యాఽభావరూపభేదబుద్ధి ప్రాధాన్యముచే'మాయాతత్త్వ'మని యెన్నబడును.

కల, విద్య, రాగము, కాలము- నియతి- అను పంచతత్త్వములు పురుషునకు కంచుక (ఐవికె) రూపములుగ నుండుటం జేసి ముందుగా కంచుకియైన పురుషతత్త్వమును నిరూపించి పిమ్మట కలాదిపంచతత్త్వములను నిరూపించుచున్నాను.

కఱ్ఱలరాపిడిచే నిప్పుకణములు వెలువడునట్లు, పరశివుని యిచ్ఛాశక్తియోగమున గలిగిన శివాంశమే మాయాశక్తియందు చేరి "పురుషతత్త్వ" మని యెన్నబడును. ఈ పురుషతత్త్వము మాయామలముచే ఆవరింపబడిన కారణమున, ఆత్మయెడ అనాత్మత్వజ్ఞానము, అనాత్మవస్తువుల యెడ ఆత్మత్వజ్ఞానము "నేను సుఖిని, నేను దుఃఖిని" అనెడి బుద్ధియు కలుగుచున్నవి. ఈవిధముగా పురుషుడు ఆణవాదిమలములతోకూడియున్న కారణముననే 'సంసారి'యని చెప్పబడును.

మాయావృతుడయి పురుషుడు, తన సర్వకర్తృత్వాది శక్తులను విడిచి కించిత్కర్తృత్వాది శక్తులతో కూడియుండుటచే, ఈకించిత్కర్తృత్వరూపకశక్తియే"కలాతత్త్వ"మనిచెప్పబడును. కించిజ్జ్ఞత్వరూపకశక్తియే 'విద్యాతత్త్వ' మనబడును. స్రక్చందనవనితాది విషయములయెడ (పూలదండలు, సుగంధవస్తువులు, స్త్రీలు మున్నగునవి) వాంఛను గలిగించునదే"రాగ

తత్త్వ'' మనబడును. భూతభవిష్యద్వర్తమానకాల వ్యవహార ములకు అసాధారణకారణమగునదే 'కాలతత్త్వ' మనబడును. 'ఈ కారణముచే ఈకార్యమే కలుగును. వేఱొండు కార్యము కలుగనేరదు' అను నియమమునకు కారణమయినదే 'నియతి తత్త్వ'మని చెప్పబడును.

కార్యోన్ముఖత్వముతో గూడిన ఇచ్ఛాశక్తి తనయందున్న జ్ఞానశక్తి క్రియాశక్తుల అన్యోన్యాఽభావభేదబుద్ధిరూపక మయిన మాయాతత్త్వమునందు ప్రతిస్ఫురణ మొందుటయే ''ప్రకృతితత్త్వ'' మని చెప్పబడును. ఈ ప్రకృతితత్త్వము సుఖ దుఃఖ మోహములకు కారణమయిన సత్త్వరజస్తమో గుణ ములయొక్క సామ్యావస్థారూపము నొంది మహత్తత్త్వము మొదలు పృథివితత్త్వమువఱకుగల 23 తత్త్వములకు మూల కారణమగుచున్నది. 'ఇదమిత్థమ్' (ఇది యిట్లు) అను నిశ్చయ మునకు కారణమయినది 'బుద్ధితత్త్వ'మని చెప్పబడును. దీనికే మహత్తత్త్వమని మఱియొక పేరుగలదు. 'నేను-నాది' అనెడి యహంకారమమకారములకు కారణమయినదే 'అహంకార తత్త్వ' మనబడును. 'స్థాణుర్వా పురుషోవా' (స్థాణుదు కాని, పురుషుడుగాని) అనెడి సంకల్పవికల్పములకు (సందేహములకు) కారణమయినదే 'మనస్తత్త్వ' మని చెప్పబడును. బుద్ధి, అహం కారము, మనస్సు అను తత్త్వములు మూడు శరీరములోపల నున్నవి కావున నివియే 'అంతఃకరణము' అని చెప్పబడును. అంతఃకరణము ఇచ్ఛాశక్తి ప్రధానమయి యున్నది. ముందు

చెప్పిన శక్తితత్త్వము బాహ్యశరీరము నాధారముగా గొని శబ్దజ్ఞానమునకు సాధనమయి "శ్రోత్రతత్త్వ" మనియు, స్పర్శజ్ఞానమునకు సాధనమై "త్వక్తత్త్వ" మనియు, రూపజ్ఞానమునకు సాధనమయి "నేత్ర తత్త్వ"మనియు, రసజ్ఞానమునకు సాధనమై "జిహ్వాతత్త్వ" మనియు, గంధజ్ఞానమునకు సాధనమై "ఘ్రాణతత్త్వ"మనియు చెప్పబడును. ఈ యింద్రియములయిదు జ్ఞానశక్తిప్రధానములవుటచే వీనిని జ్ఞానేంద్రియములని వ్యవహరింతురు. పైనిచెప్పిన శక్తితత్త్వమే ఉచ్చారణక్రియకు సాధనమయినందున 'వాక్తత్త్వ' మనియు, దానము (ఇచ్చుట) ఆదానము (గ్రహించుట) మొదలగు క్రియలకు సాధనమయినందున 'పాణితత్త్వ' మనియు, గమనాగమనములు (రాకపోకలు) అనుక్రియలకు సాధనమయిన కారణమున 'పాదతత్త్వ' మనియు, మలవిసర్జనమునకు సాధనమయినందున "పాయు (గుదము) తత్త్వ" మనియు, రేతస్సు (వీర్యము) మూత్రము విడుచుటకు సాధనమయినందున 'ఉపస్థతత్త్వ'మనియు చెప్పబడును. ఈ యింద్రియములయిదు క్రియాశక్తి ప్రధానములవుటచే వీనిని కర్మేంద్రియములని వ్యవహరింతురు.

పైనిజెప్పిన బుద్ధితత్త్వాదికములయిన పదుమూడు తత్త్వములు ఇచ్ఛా, జ్ఞాన, క్రియాత్మకములయి యున్నవి.

కేవలము శ్రోత్రేంద్రియమువలన గ్రహింపదగినది శబ్దతత్త్వమనియు, కేవలము త్వగింద్రియమువలన తెలియదగినది స్పర్శతత్త్వ మనియు, కేవలము నేత్రేంద్రియ మూలమున

తెలియదగినది. రూపతత్త్వమనియు, కేవల జిహ్వేంద్రియము వలన తెలియదగినది రసతత్త్వమనియు, కేవలము ఘ్రాణేంద్రియ మువలన తెలియదగినది గంధతత్త్వమనియు చెప్పబడును. శబ్దవి షయమున ధ్వన్యాత్మకవర్ణాత్మకశబ్దమని, స్పర్శవిషయమున శీతోష్ణస్పర్శయని, రూపవిషయమున నీలపీతాదిరూపములని, రసవిషయమున మధురామ్లాది (తీపి, పులుపు) రసములని, గంధ విషయమున సుగంధదుర్గంధరూపములని విభేదవిభాగము లున్న ప్పటికి, సామాన్య రూపకములుగా నుండుటచే శబ్దాదితత్త్వ ములు 'తన్మాత్రలు' అనియు వ్యవహృతములగుచున్నవి.

వాయువు, అగ్ని, జలము, పృథివి అను తత్త్వములకు గూడ అవకాశమున్నను, శబ్దగుణము ప్రధానముగా గల తత్త్వమే "ఆకాశతత్త్వ"మనియు, కంపనము (కదలుట) భ్రమ ణము (తిరుగుట), శోషణము (ఆరుట) వేగము (వడి) అను క్రియలుగూడ గలిగియున్నను, స్పర్శగుణము ప్రధానముగాగల తత్త్వమే "వాయుతత్త్వ"మనియు, దహనపచనక్రియలు గలిగి యున్నను రూపగుణము ప్రధానముగా గల తత్త్వమే 'తేజ స్తత్త్వ'మనియు, ద్రావణము (ద్రవించుట) ప్లావనము (ప్రవహిం చుట) ఆప్యాయనము (హితముగా నుండుట) మున్నగు స్వభా వములు కలిగియున్నను, రసగుణము ప్రధానముగా గల తత్త్వ మే 'జలతత్త్వ'మనియు, భేదనయోగ్యముగా నున్నను గంధ గుణము ప్రధానముగా గల తత్త్వమే 'పృథివీతత్త్వ"మనియు చెప్పబడును.

ఆకాశాదికములయిన యీ పంచతత్త్వములు పంచ మహాభూతములనియు వ్యవహరింపబడును.

నిగమాగమప్రసిద్ధములయిన పయి ముప్పదియారు తత్త్వములు సచ్చిదానందస్వరూపుడయిన శక్తివిశిష్టపరశివ బ్రహ్మము యొక్క పరిణామరూపములగుటచే, వీరశైవమతము పరిణామవాదమును, జగత్సత్యత్వవాదమును బోధించుచున్నది.

పరిణామవాద విచారము

చరాచరాత్మకమయిన యీ ప్రపంచమెల్ల శక్తివిశిష్టుడయిన పరశివుని పరిణామరూపమయియున్నది. కేవలము శక్తి విశిష్టుడయిన పరశివుడే యీ సకల ప్రపంచరూపమున ప్రకాశించుచున్నాడని శివాగమములు చాటుచున్నవి. ఈ విషయమునే శ్రీ జగద్గురు రేణుకాచార్యులు సిద్ధాంత శిఖామణిలో

ఆత్మశక్తి వికాసేన శివో విశ్వాత్మనాస్థితః
కుటీభావాద్యథాభాతిపటః స్వస్యప్రసారణాత్ (౬౫)
పత్రశాఖాదిరూపేణ యథాతిష్ఠతి పాదపః॥
తథాభూమ్యాదిరూపేణ శివఏకో విరాజతే (౬౬)
(పరిచ్ఛేదము ౧౦)

వృక్షస్య పత్రపుష్పాది వటబీజేస్థితం యథా॥
తథా హృదయ బీజస్థం విశ్వమే తత్పరాత్మనః (౭౬)

(పరిచ్ఛేదము ౨౦) అను శ్లోకములలో వస్త్రము తన ప్రసరణము (వ్యాప్తి) వల్లనే వస్త్రమందిర (డేరా) రూపమున ఎట్లు కాన్పించుచున్నదో, అట్లే శివుడు తనయందు నిత్య సంబంధముతోనున్న విమర్శశక్తి యొక్క వికాసముచే విశ్వ ప్రపంచరూపమున తోచుచున్నాడనియు, చెట్టు, ఆకులు,

బొమ్మలు మొదలగు రూపములతో ఎట్లు పరగుచున్నదో యట్లే శివుడు భూమి, జలము మున్నగు రూపములతో విరాజిల్లుచున్నాడనియు, మిక్కిలి విరివిగల మఱ్ఱిచెట్టుయొక్క ఆకులు, పూవులు, పండ్లు అతిసూక్ష్మమయిన మఱ్ఱివిత్తనములో అడగియుండి యెట్లు బహిర్గతములయి విస్తారరూపములతో విలసిల్లుచున్నవోయట్లే చరాచరాత్మకమయిన యీ విశాలప్రపంచము పరమాత్మయొక్క హృదయరూపక బీజమునందు అతిసూక్ష్మముగ అడగియుండి వెలువడుచున్నదనియు స్పష్టముగ నిరూపించియున్నారు. మఱియు నీవిషయమే "స్వశక్తి ప్రచయోఽస్య విశ్వమ్" (3-30) అను శివసూత్రమునందును

"శక్తిశ్చ శక్తిమాంశ్చైవ పదార్థద్వయముచ్యతే।
శక్తయోఽస్యజగత్ కృత్స్నం శక్తిమాంస్తు మహేశ్వరః"

అని సర్వమంగళా నామక గ్రంథశ్లోకమునందును ప్రతిపాదితమయి యున్నది.

"బహుస్యాం ప్రజాయేయ" (౬-౨-3)

అని ఛాందోగ్యోపనిషత్తునందు "నేనే నానావిధ ప్రపంచరూపమున పరిణమించుచున్నాను" అని పరబ్రహ్మ వ్యక్తమొనర్చినాడు. మఱియు ముండకోపనిషత్తునందలి "యథోర్ణనాభిః సృజతేగృహ్ణతేచ"(౧-౧-౩)

అనుమంత్రముగూడ సాలెపురుగు తన విశిష్ట స్వరూపమును బట్టియే గూడునల్లి మరల దానిని తన యారూపమునం

డేలీనము చేసికొనునట్లు శక్తి విశిష్టుడయిన పరశివుడే నిజశక్తి వికాసరూపకమయిన యీప్రపంచమంతయు తన విశిష్టస్వరూపమువలననే నిర్మించి, దానిని తిరిగి యారూపమునందే లయము నొందించునని బాహాటముగ చాటుచున్నది.

తాబేలు ఒక్కసమయమున తన కాళ్ళను బయటికి వెలువరించి నీటిలో విహరించుచు మఱొక్కవేళ వానిని లోనికి ముడుచుకొని యూరక కూర్చుండుట యందఱెఱింగియే యుందురు. అట్లే పరశివుడు నిత్యసంబంధముతో తనయందిమిడి యున్న జగత్తు నొక్కవేళ బయటికి వికసింపజేసి వేఱొండు సమయమున దానిని తనయందే సంకుచితమొనర్చునని గ్రహింపదగును. తాబేలు తనకాళ్ళను బయటికి నిడుపుగా చాచినప్పుడు వానికి ఉత్పత్తియు లోనికి ముడుచుకొన్నపుడు వినాశము కలిగినదని తలంచుట మిక్కిలి పరిహాసాస్పదమగునుగదా! సత్యము నిత్యమునయిన యీజగత్తున కొకవేళ ఉత్పత్తి మఱొకవేళ నాశము కలుగునని తలంచుటకూడ నట్లే హాస్యాస్పదమగును. కావుననే యీజగత్సృష్టిలయములను, ఉత్పత్తినాశములని చెప్పక యవి పరమేశ్వరుని శక్తివికాస, శక్తిసంకోచములుగ చెప్పవలెననుటయే నిగమాగమముల యభిప్రాయమై యున్నది. పరబ్రహ్మయొక్క పరిణామరూపకమయిన ప్రపంచమునకు ఉత్పత్తివినాశములను చెప్పెడిచో ఆపరబ్రహ్మమునకు గూడ అట్టి యుత్పత్తినాశములు కలవని యసంగత ప్రసంగము తప్పక చేయవలసివచ్చును. అందుచేత అనాదియయిన జగత్తు

విషయమున పయిరీతిని నిర్వచింపవలె ననుటయే వీరశైవసిద్ధాంతమంతటి రహస్యము.

—◆ జగత్సత్యత్వ విచారము. ◆—

శక్తివిశిష్ట పరబ్రహ్మమునుండి యుత్పన్నమయిన యీ సకలచరాచరాత్మక ప్రపంచము మిథ్యగాక సత్యమయినదే యని యనేక శ్రుతివాక్యములు ముక్తకంఠముతో ఘోషించుచున్నవి.

"సోఽకామయత । బహుస్యాం ప్రజాయేయేతి
సతపోఽతప్యత । సతప స్తప్త్వా । ఇదం సర్వమసృజత
యదిదం కించ తత్సృష్ట్వా । తదేవాను ప్రావిశత్.
తదను ప్రవిశ్య సచ్చత్యచ్చాభవత్ ।నిరుక్తం చానిరుక్తం చ
నిలయనం చానిలయనం చ । విజ్ఞానం చావిజ్ఞానం చ,
సత్యం చానృతం చ సత్యమభవత్ యదిదం కించ ।
తత్సత్య మిత్యాచక్షతే". (ఆనందవల్లి ౬)

అను తైత్తిరీయోపనిషన్మంత్రముగూడ, సకలచరాచరాత్మకమయిన జగత్తు పరబ్రహ్మమునుండి నిర్మింపబడినదని తననుండి నిర్మితమయిన యీజగత్తునందు పరబ్రహ్మ ప్రవేశించి జగద్రూపమున పరిణమించు చున్నాడని, పరబ్రహ్మ పరిణామ రూపకమయిన జగత్తుగూడ నిత్యమయినదే యని యతిస్పష్టముగ ప్రతిపాదించుచున్నది. ఈవిషయమును శ్రీరేణుకభగవత్పాదులు సిద్ధాంతశిఖామణిలో

"యస్మాదేతత్స ముత్పన్నం మహాదేవాచ్చరాచరం ।
తస్మాదేత న్నభిద్యేత । యథాకుంభాదికం మృదః" (౬_౨)

శివతత్త్వా త్సముత్పన్నం । జగదస్మాన్న భిద్యతే ।
ఫేనోర్మిబుద్బుదాకారో । యథాసింధోర్న భిద్యతే
(పరిచ్ఛేదము ౧౦)

యథా పుష్పపలాశాదిర్వృక్షరూపాన్నభిద్యతే ।
తథాశివాత్పరాకాశాజ్జగతో నాస్తి భిన్నతా (౭౧)
(పరిచ్ఛేదము ౧౯)

అనుశ్లోకములందు మన్నుతో జేయబడిన కుండ మొదలయిన పదార్థము లెట్లు మన్నుకంటె భిన్నములు కావో, అట్లే శివునినుండి యుత్పన్నమయిన యీ చరాచరాత్మక జగము శివునికంటె వేఱుగాదనియు, సముద్రమునుండి పుట్టిన నురువు, కెరటము, నీటిబుడగలు మున్నగునవి సముద్రముకన్న భిన్నములుగా నట్లే శివతత్త్వమునుండి జనించిన జగము శివునికన్న అన్యముకాదనియు వృక్షమునందలి పత్రములు పుష్పములు, ఫలములు, కొమ్మలు మొదలగునవి ఎటులా చెట్టుకంటె వేఱు కానేరవో యట్లే పరశివుని పరాకాశ స్వరూపకమయిన ప్రపంచమాతనికన్న భిన్నమయినది కాదనియు విస్పష్టముగబోధించి యున్నారు.

## ప్రమాణ విచారము

వీరశైవ సిద్ధాంతమున ప్రత్యక్షము, అనుమానము, శబ్దము అను ప్రమాణములు మూడు మాత్రమంగీకృత మయినవి. తక్కిన దర్శనములందు వానికర్తలు వివిధప్రమాణముల నంగీకరించి యున్నారు. చార్వాకులు ప్రత్యక్ష మొక్కటియే

ప్రమాణమని, వైశేషికులు, బౌద్ధులు, ప్రత్యక్షము, అను
మానము రెండునుగూడ ప్రమాణములని, సాంఖ్యులు, ప్రత్య
క్షము, అనుమానము, శబ్దము అను మూడునుగూడ ప్రమాణ
ములని చెప్పియున్నారు. ఉదయనాచార్యుడు మున్నగు
నైయాయికులు పయిమూడింటితో ఉపమానమునుగూడచేర్చి
నాలుగు ప్రమాణములని, ప్రాభాకర సిద్ధాంతమువారు ఆనా
లుగింటితో అర్థాపత్తియను మఱొకటికూడచేర్చి యైదుప్రమా
ణములని భాట్టమతీయులు,అద్వైతులు పయి అయిదంటికి అను
పలబ్ధి యని మఱొకటి కలిపి ఆఱుప్రమాణములని,పౌరాణికులు,
ఐతిహాసికులు ఈయాఱింటితో సంభవము, ఐతిహ్యము అని
మఱిరెండు చేర్చి యెనిమిది ప్రమాణములని యంగీకరించి
యున్నారు. ఇట్లు వీరధికముగ చెప్పిన ఉపమానాదిక
ప్రమాణములయిదు మొదటచెప్పిన ప్రత్యక్షానుమానశబ్దప్ర
మాణములందే, అంతర్గతములయి యున్నవని వీరశైవమతా
చార్యులు ప్రమాణనిరూపణ సందర్భమున స్పష్టముగ ప్రతి
పాదించి యున్నారు. ఎట్లనగా అనుపలబ్ధి యనునది ప్రత్యక్ష
ప్రమాణమునందును, ఉపమానము,అర్థాపత్తి,సంభవము అను
మూడు అనుమానప్రమాణమందును, ఐతిహ్యమనునది శబ్ద
ప్రమాణమునందును అంతర్భావముతో చేరియే యున్నవని
వీరి యభిప్రాయమై యున్నది.

ప్రత్యక్షము, అనుమానము, శబ్దము, ఉపమానము.
అర్థాపత్తి, అనుపలబ్ధి (అభావము) అను ఆఱుప్రమాణములలో

మొదటివైదు భావ పదార్థమును తోపింపజేయునవియై యున్నవి. భావరూప ప్రమేయమును తోపించు ఈప్రమాణములు దేనియందుండవో, అందు భావగ్రాహక ప్రమాణ పంచకముయొక్క అభావమే ఒక స్వతంత్రప్రమాణముగానిలిచి ప్రమేయాభావమనెడి ప్రమేయమును తోపించును. ఇదియే అనుపలబ్ధి (అభావప్రమాణ)మని చెప్పబడును "అత్రఘటో నాస్తి" (అచ్చట కుండలేదు) అన్నప్పుడు ఘటాఽభావమనునది (ఘటములేకుండుట) ఆఘటాఽభావమునకు అధికరణభూతమయినది భూతలస్వరూపమే యగుటచేతను, పై భూతలరూపకమయిన యాయధికరణము ఇంద్రియగోచరప్రత్యక్షముగ నుండుట వలనను, ఈఘటాఽభావ మనునది ప్రత్యక్షమే యగుచున్నది. అందుచేత అభావము (అనుపలబ్ధి) అను ప్రమాణము ప్రత్యక్ష ప్రమాణమునందే యిమిడియున్నది.

"గోసదృశో గవయః" (ఎద్దువంటిది గవయమృగము) అనెడి అతిదేశవాక్యమంవలి యర్థమును జ్ఞప్తియందుంచుకొన్నవారికి గవయమృగ మగపడినప్పుడుకలిగెడి గోసంబంధికజ్ఞానము అనుమానము నందిమిడియే యుండును. ఏలయన- గవయమృగ మగపడినప్పుడు దానివలె ఎట్టయెదుట ఎద్దు ప్రత్యక్షముగ లేని మాటవాస్తవమే యైనను దానిగూర్చిన జ్ఞానము గవయమృగసాదృశ్యజ్ఞానము చేత ఉత్పన్నమగు కారణమున, ఉపమానప్రమాణము అనుమానప్రమాణము నందే యంతర్గత మయినదని గణింపదగును" "పీనో దేవదత్తో

దివానభుంక్తే" (క్రొవ్వుబలిసియున్న దేవదత్తుడు పగటిభోజనము చేయడు) అనువాక్యము చెప్పినప్పుడు ఆదేవదత్తుడు పగటి తిండినూనుట యను దానితోపాటు దానికి కారణమయిన యాతని శరీరపీనత్వము ప్రత్యక్షగోచరముగ నుండుటచే దీనికి ఉపపత్తిగా ఆతడు రాత్రి యొక్కపూటయే భోజనము చేయును అనుసంగతి వేఱుగ వక్కాణింపకున్నను, దానిని చెప్పినట్లే యగును; ఎందుచేతననగా పగలు రాత్రి రెండుపూటలుగూడ ఎప్పుడు భోజనము చేయనివానికి దేహముక్రొవ్వుబలిసియుండుట సంభవమే కాదుగదా! కావున పయివాక్యమున వ్యాప్యమయి యున్న ఉక్తపీనత్వము (స్పష్టముగ చెప్పబడిన యతని యొడలి కండతనము) వ్యాపకమయిన యాతని రాత్రి భోజనమును కల్పించుచునే (సూచించు) యున్నది. అందుచే అర్థాపత్తి ప్రమాణము అనుమాన ప్రమాణమందే యడగి యున్నదని యెన్నదగును—

"శతే పంచాశత్" (నూఱులో ఏబది చేరియున్నది) అను న్యాయ మనుసరించి చెప్పిన యొక సంఖ్యలో తక్కువ సంఖ్యయే లేనిపక్షములో నంతకంటె హెచ్చుసంఖ్యయుండుట యసంభవమగును. హెచ్చుసంఖ్యయే యున్నచో దానిలో తక్కువ సంఖ్య యిమిడియే యున్నదని వేఱుగ చెప్పనక్కఱ లేదు. కావున సంభవప్రమాణ మనునదిగూడ అనుమాన ప్రమాణమునందే చేరియున్నదని భావింపనగును.

"ఇహావటే యక్షస్తిష్ఠతి (ఈమఱ్ఱిపై భూతమున్నది)అను

వాక్యములో "ఇతిహస్మాహుః" (ఇట్లు చెప్పెదరు) అనెడిప్రసిద్ధిని సూచించు ఐతిహ్యవచనముశబ్దరూపమునందే యుండుటచే ఐతిహ్యప్రమాణము శబ్దప్రమాణమునందే యంతర్భూతమయి యున్నది. అందుచే ఇతర మతాచార్యులు అధికముగ పేర్కొని యంగీకరించిన ఉపమానము, అర్థాపత్తి, అనుపలబ్ధి, సంభవము, ఐతిహ్యము అను ప్రమాణములైదును. ప్రత్యక్షానుమానశబ్దము లన్నప్రమాణములు మూడింటిలోనే యిమిడియున్నవని యెల్లరకు తెల్లము కాకమానదు. అందుచే శ్రుతిప్రసిద్ధమయిన యీప్రమాణత్రయమునే వీరశైవమతాచార్యు లంగీకరించి యున్నారు.

## లింగాంగ సామరస్యవిచారము

వీరశైవ సిద్ధాంతమున పరశివబ్రహ్మము "స్థలము" అనుపేరితోగూడ నిర్దేశింపబడియున్నది.

"స్థీయతే లీయతేయత్ర జగదేతచ్చరాచరం
తద్బ్రహ్మస్థలమిత్యుక్తం స్థలతత్త్వవిశారదైః"

చరాచరాత్మకమయిన యీజగత్తు దేనియందు స్థితిని, లయమును బొందుచున్నదో యాబ్రహ్మము స్థలమని పేర్కొనబడును. ఈస్థలరూపక పరశివబ్రహ్మము తనలీలచే లింగస్థలము, అంగస్థలము అని యిరుతెఱఁగులయ్యెను. పూర్వోక్తమయిన చిత్తశక్తివిశిష్టుడయిన జీవుడే అంగమను పదముచేతను, చిచ్ఛక్తి విశిష్టుడయిన పరశివుడే లింగమను పదముచేతను వ్యవహరింపబడుదురు. లింగము భక్తానుగ్రహార్థమై స్థూలసూ

క్ష్మకారణ నామకములగు శరీరస్థానభేదములచే ఇష్టలింగము, ప్రాణలింగము భావలింగము అని మూడువిధములయియొప్పును. అంగము త్యాగాంగము, భోగాంగము, యోగాంగము, అని మూడువిధములయియొప్పును. మరల ఇష్టలింగము ఆచారలింగ గురులింగములనియు, ప్రాణలింగము శివలింగ చరలింగముల నియు,భావలింగము ప్రసాదలింగ మహాలింగములనియు,ఇట్టులు ఆఱుప్రకారములయి వర్తిల్లును. ఈవిధముగానే త్యాగాంగము భక్తమహేశ్వర స్థలములుగను, భోగాంగము ప్రసాది, ప్రాణ లింగిస్థలములుగను యోగాంగము-శరణ, ఐక్యస్థలములుగను ఆఱుస్థలములుగ వ్యవహృతమగును. మఱియు అంగస్థలము అవాంతరభేదములతో 44 విధములుగను, లింగస్థలము అవాం తరభేదములతో 57 విధములుగను అగును. ఇట్టులీ యంగలిం గస్థలములు రెండును మొత్తము 101 (ఏకోత్తరశత) స్థలము లగును. ఈ యేకోత్తరశతస్థలాత్మకమయిన లింగాంగసామ రస్యజ్ఞానమే వీరశైవసిద్ధాంతమున సాధకుని మోక్షమునకు మూలభూతమయియున్నది. ఇంక, లింగస్థల విషయమును గూర్చివిచారింతము.

"ఇష్టలింగమిదం స్థూలం యద్బాహ్యేధార్యతే తనౌ
ప్రాణలింగంతు తత్సూక్ష్మం యదంతర్భావనామయం
పరాత్పరంతు యత్ప్రోక్తం తృప్తిలింగం తదుచ్యతే."

స్థూలదేహముపయి ధరించునది ఇష్టలింగమనియు, సూక్ష్మశరీరమున ధరించునది. ప్రాణలింగమనియు, కారణ

శరీరమున ధరించునది భావలింగమనియు చెప్పబడును. ఈ త్రివిధలింగములనుండి తిరిగి యాఱువిధములుగ నేర్పడిన, ఆచారలింగాదికముల స్వరూపమీాక్రింద వివరింపబడినది.

"ఆచారలింగం ఘ్రాణాఖ్యం భక్తస్థలసమాశ్రియం
నివృత్తికలయోపేతం గంధగ్రిహణసాధనం. ౧
గురులింగంతు జిహ్వాఖ్యం మహేశస్థలసంశ్రియం
ప్రతిష్ఠాకలయోపేతం రసగ్రహణసాధనం. ౨
శివలింగం తు నేత్రాఖ్యం ప్రిసాదిస్థలసంశ్రియం ।
విద్యాకలా సమాయుక్తం రూపగ్రిహణసాధనం । (3)
త్వగాఖ్యం జంగమం లింగం ప్రాణలింగిస్థలాశ్రియం ।
శాంత్యాఖ్య కలయోపేతం స్పర్శగ్రిహణ సాధనం (४)
ప్రసాదలింగం శ్రోత్రాఖ్యం శరణస్థల సంశ్రయం ।
శాంత్యతీత కలయోపేతం శబ్దగ్రహణ సాధనం । (౫)
మానసంతు మహాలింగ మైక్యస్థలసమాశ్రయం ।
శాంత్యతీతోత్తరోపేతం సర్వగ్రహణసాధనం । (౬)

ఘ్రాణరూపకమయిన ఆచారలింగము భక్తస్థలము నాశ్రయించి నివృత్తికలతోగూడి గంధమును (వాసనను) గ్రహించుటకు సాధనమగు చున్నది. ఘ్రాణము (ముక్కు) ఇడాపింగళా నాడులద్వారమున ప్రాణవాయువుయొక్క సంచారమునకు ఆశ్రయమయి యుండుటవలనను దేహశుద్ధికి హేతుభూతమయిన ప్రాణాయామమును సాధకు డాచరించుటకు సాధనమగుటవలనను దీనికి ఆచారలింగమను పేరుకలిగినది.

జిహ్వారూపకమయిన గురులింగము మాహేశ్వర స్థలము నాశ్రయించి ప్రతిష్ఠాకలతోఁగూడి రసమును (ద్రవరూపకమయిన పదార్థము) గ్రహించుటకు సాధనమగుచున్నది; జిహ్వ (నాలుక) షడక్షరీమంత్రము నుచ్చరించుటకు సాధనమగుటవలనను, ఈమహామంత్రము మంత్రమూర్తియైన గురువు ముఖమునుండి ప్రాప్తమగుటవలనను దీనికి గురులింగమను పేరు కలిగినది.

నేత్రరూపకమయిన శివలింగము ప్రసాదిస్థలము నాశ్రయించి విద్యాకలతోఁగూడి రూపమును (ఆకారము) గ్రహించుటకు సాధనమగుచున్నది. నేత్రము (కన్ను) తనలో గుండ్రము గానున్న పాపయందలి శివప్రకాశముతోఁగూడి సమస్తరూపక పదార్థములను ప్రకాశింపజేయుటకు సాధనమైనందున దీనికి శివలింగమను పేరుకలిగినది.

త్వగ్రూపకమయిన చరలింగము ప్రాణలింగిస్థలము నాశ్రయించి శాంతికలతోఁగూడి స్పర్శను (తాకుట) గ్రహించుటకు సాధనమగుచున్నది. త్వక్కు (చర్మము) శరీరమందలి యన్నియవయవములను వ్యాపించి, చల్లదనము వేడిమి మున్నగు స్పర్శజ్ఞానమునకు సాధనమగుట వలనను, ఇది సంచరణ (వ్యాపనము) శీలమయిన వాయువు (గాలి) యొక్క అంశమగుటవలనను దీనికి చరలింగమను నామమేర్పడినది.

శ్రోత్రరూపకమయిన ప్రసాదలింగము శరణస్థలము నాశ్రయించి శాంత్యతీతకలతోఁగూడి, శబ్దమును (ధ్వని) గ్రహిం

చుటకు సాధనమగుచున్నది. శ్రోత్రము (చెవి) శబ్దమును గ్రహించుటకు సాధనమగుటవలనను, నాదము, సునాదము, నినాదము, మహానాదము అనురూపములను వరుసగ గలిగిన పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ వాక్కులవలన ప్రాప్తమగు అనుగ్రహరూపక ప్రసాదమునకు హేతువగుటచేతను దీనికి ప్రసాదలింగమను వ్యవహారము కలిగినది.

మనోరూపకమయిన మహాలింగము ఐక్యస్థలము నాశ్ర యించి శాంత్యతీతోత్తర కలతోగూడి సమస్తమును గ్రహిం చుటకు సాధనమగుచున్నది. మనస్సు శ్రోత్రము, నేత్రము ము న్నగు ఇంద్రియములవలె ఒక్కొక్క విషయమును గ్రహించు టకు మాత్రమేగాక సర్వవిషయములను గ్రహించుటకు సాధన మగుటవలనను, ఇంద్రియములకెల్ల మహారాజయి యుండుట వల నను దీనికి మహాలింగమను పేరు గలిగినది. ఇంక అంగస్థల విష యమును విచారింతము.

"అంగస్థలం తథా ప్రోక్త మాచార్యైః సూక్ష్మదర్శిభిః।
యోగాంగం ప్రథమం ప్రోక్తం భోగాంగంచ ద్వితీయకం।
త్యాగాంగం చ తృతీయం స్యాదిత్యేవం త్రివిధం స్మృతం"

అంగస్థలము యోగాంగము, భోగాంగము, త్యాగాం గము అని మూడువిధము లగుచున్నది. వీరశైవుడు తనకు గురులింగజంగమములకు ఐక్యయోగానుసంధానమును గావిం చుటచే దీనికి యోగాంగ మనుపేరు కలిగినది. గురులింగ జంగమార్పితమయిన ప్రసాదమును స్వీకరించుట మూలముగా

సుఖభోగము ననుభవించుటచే దీనికి భోగాంగ మను నామమే ర్పడినది. శక్తివంచన మేమాత్రము లేకుండ తనుమనోధనము లను గురు లింగ జంగమములకు త్యాగముచేయు కారణమున దీనికి త్యాగాంగ మను వ్యవహారము కలిగినది.

"సదాచారః శివే భక్తిర్లింగే జంగమ ఏకధీః ।
లాంఛనే శరణే భక్తిర్భక్తస్థలమనుత్తమం ।
కేవలే సహజే దానే నిష్ణాతః శివతత్పరః ।
బ్రహ్మాది స్థాన విముఖో భక్తో మాహేశ్వరస్స్మృతః
మనఃప్రసాద సిద్ధ్యర్థం నిర్మలజ్ఞానకారణం ।
శివప్రసాదం స్వీకుర్వన్ ప్రసాదీత్యేవ కథ్యతే ।
లింగం చిదాత్మకం బ్రహ్మ తచ్ఛక్తిః ప్రాణరూపిణీ ।
తద్రూప లింగజ్ఞానీ ప్రాణలింగీతి కథ్యతే॥
సతీచాహం పతిర్లింగం హృదియుక్తః స్వయంప్రభుః
ప్రాపంచిక సుఖం నాస్తి శరణస్థల ముత్తమం।
ప్రాణలింగాదియోగేన సుఖాతిశయమేతివాన్ ।
శరణాఖ్యః శివేనైక్య భావనాదైక్యవాన్ భవేత్"।

సదాచార శీలములు, శివభక్తి, గురు లింగ జంగమ ములయెడ సమబుద్ధి, శివలాంఛనములందును శివశరణులయెడ ను భక్తి కలిగి యుండువాడు భక్తుడని చెప్పబడును. సహజ దానశీలుడయి శివునియందాసక్తితో బ్రహ్మాదిపదముల యెడ విముఖుడయి యుండు భక్తుడే మాహేశ్వరుడని చెప్పబడును. ఈమాహేశ్వరుడే తన మనః ప్రసాదమునకయి (ప్రసన్నత) నిర్మ

లజ్ఞానకారణమయిన శివ ప్రసాదమును గ్రహించుటవలన "ప్రసాది" అని యెన్నబడును. పరశివబ్రహ్మ చిత్స్వరూపుడనియు, ఆతనియందున్న శక్తి ప్రాణస్వరూపమనియు, లింగమీరెండు స్వరూపములు కలిసియున్నదనియు తెలియుప్రసాదియే ప్రాణలింగియని వ్యవహరింప బడును. లింగము పతియని తాను సతినని భావించి ప్రాపంచిక సుఖ శూన్యుడయి యుండు ప్రాణలింగియే శరణుడని యెన్నబడును. ఈశరణుడు ప్రాణలింగాది యోగములచే సుఖాతిశయము నొంది "శివోఽహం" భావనతో శివునియందు ఏకత్వమొందుటవలన ఐక్యవంతుడని చెప్పబడును. ఈభక్తాది స్థలములు ఆఱును ముక్తిమందిరమునకు సోపాన (మెట్లు) రూపకములుగా నున్నవి.

అంగస్థల ప్రతిపాదితుడయిన భక్తుడు లింగస్థల ప్రతిపాదితమయిన ఆచారలింగమునకు అంగముగా నున్నందున, ఈభక్తుడు ఆచారలింగమునందు సామరస్యము నొందును. ఇదే విధమున మాహేశ్వరుడు గురు లింగ మందును, ప్రసాది శివలింగమందును, ప్రాణలింగి జంగమ (చర) లింగమందును, శరణుడు ప్రసాది లింగమందును, ఐక్యవంతుడు మహాలింగమందును సామరస్యమును చెందెదరు. ఈరీతిగనే ఆచారలింగము గురు లింగమునందును, గురులింగము శివలింగమందును, శివలింగము చరలింగమందును, చరలింగముప్రసాదలింగమందును, ప్రసాదలింగము మహాలింగమందును, మహాలింగము పరశివరూపకమయిన ఘనలింగమందును సామరస్యమును జెంది అఖండానందానుభవము కలదియగును.

"యథానద్యః స్పందమానాః సముద్రేఽస్తంగచ్ఛంతి,
నామరూపే విహాయ, తథా విద్వాన్నామరూపాద్వి
ముక్తః పరాత్పరం పురుష ముపైతిదివ్యం" (3-౨-౮)

అను ముండకోపనిషత్ప్రమాణానుసారముగా నదులు సముద్రమున నామరూపములువిడిచి సామరస్యమును జెందునట్లే, శివజ్ఞాన సంపన్నుడగు వీరశైవుడు నామరూపములనుండి విముక్తుడయి పరశివునియందు సామరస్యమునొందును.

జలేజలమివన్యస్తం వహ్నౌవహ్ని రివార్పితః
పరేబ్రహ్మణి లీనాత్మా విభాగేన నదృశ్యతే''
పరిచ్ఛేదము (౨౦)

అని సిద్ధాంతశిఖామణిలో శ్రీ జగద్గురు రేణుకాచార్యులు వచించినట్లు లింగాంగియైన వీరశైవుడు షట్స్థలాచరణమున నీటియందు నీరు, అగ్నియందగ్ని కలిసి యేకమయిన విధముగా పరశివబ్రహ్మమునందు సమరసత్వమొంది యేకాకృతిని చెందును. శుద్ధాత్ముడయిన అంగనామక జీవుడు, లింగనామకశివుని యందు సామరస్యమొందుటచే, ఇదియే లింగాంగసామరస్యమని, శివజీవైక్యమని, శక్తివిశిష్టాద్వైతమని వ్యవహృతమయినది.

శివంభూయాత్-శివంభూయాత్-శివంభూయాత్

(మంగళమగుగాక).

# శుద్ధపత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 13,17 | మిధ్య | మిథ్య |
| 4 | 8 | | |
| 12 | 19 | (౧-౭) | (౧-౨) |
| 15 | 12 | లుగ్గడిపింప | లుగ్గడింప |
| 19 | 7 | 36 సి. శి. పది ౫ | (సి. శి. పరి ౫-౩౮) |
| 23 | 7 | (౫-౨) | (౫-౯) |
| 24 | 21 | జ్ఞాన | జ్ఞానం |
| 37 | 8 | భాట్ట | భట్ట |

# శ్రీ కాశీ జంగమవాడీమఠమున వెలకు దొరకు పుస్తకములు

I సంస్కృత భాషాప్రణీతములు (దేవనాగరిలిపిలో) వెల

| | వెల |
|---|---|
| 1. లింగధారణచంద్రిక (మహామహోపధ్యాయపండిత శ్రీ శివకుమారశాస్త్రి కృతటీకాసమేతము) | 3-0-0 |
| 2. శ్రీ మహానారాయణోపనిషత్తు (వీరశైవభాష్యము) | 1-4-0 |
| 3. పురుషసూక్తము (వీరశైవభాష్యము) | 0-4-0 |
| 4. సిద్ధాంతశిఖామణిః (మూలముమాత్రము) | 0-6-0 |
| 5. నందికేశ్వరకారికా (ఉపమన్యుమహర్షి కృతము) | 0-4-0 |
| 6. శ్రీ జగద్గురు విశ్వారాధ్యాష్టోత్తర శతనామావళిః | 0-2-0 |
| 7. శ్రీ జగద్గురు పంచాచార్యోష్టోత్తర శతమానానవళిః | 0-2-0 |
| 8. శ్రీ గణేశాష్టోత్తరశతనామావళిః | 0-2-0 |
| 9. దుర్వాదదూరీకరణమ్ | 0-4-0 |
| 10. శ్రీకరభాష్యము (అచ్చులోనున్నది) | ...... |
| 11. గోత్రసూత్రపటము | 0-2-0 |

II మహారాష్ట్ర భాషాగ్రథితములు (నాగరిలిపి)

| | |
|---|---|
| 1. వీరశైవరత్న | 1-8-0 |
| 2. శ్రీ కాశీపీఠాచే ప్రాచీనత్వ | 0-2-0 |
| 3. శక్తివిశిష్టాద్వైత సిద్ధాంత | 0-2-0 |

హిందీభాషలో (నాగరిలిపి)

| | |
|---|---|
| 1. శక్తివిశిష్టాద్వైతసిద్ధాంత | 0-2-0 |
| 2. జంగమవాడీమఠకాప్రాచీనత్వ | 0-2-0 |

## III ఆంధ్రభాషాగ్రథితములు (తెలుఁగులిపి)

1. వీరశైవరత్నము 0-8-0
2. లింగధారణవిధి 0-6-0
3. లింగధారణసిద్ధాంతము 0-2-0
4. సిద్ధాంతశిఖామణి (మూలశ్లోకములు మాత్రము) 0-4-0
5. శ్రీకరభాష్యము (చతుస్సూత్రి మాత్రము) 0-12-0
6. మఠములు, మందిరములు 0-2-0
7. రేణుకాచార్య చరిత్ర (సంక్షిప్తము) 0-1-0
8. శివానందశాస్త్రి శృంగభంగము 0-1-0
9. సంక్షిప్తశివపూజావిధి 0-2-0
10. వీరశైవమహాత్మ్యలు 0-4-0
11. రేణుకవిజయపురాణము (పద్యకావ్యము) 1-0-0
(శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రికృతము)
12. శివపంచస్తవి 3-8-0
13. విశ్వారాధ్యాష్టోత్తర శతనామావళి 0-2-0
14. పాలకురికి సోమనాథకవి చరిత్రము 3-8-0
15. వీరశైవవివాహవిధి 0-4-0
16. శక్తివిశిష్టాద్వైతసిద్ధాంతము 0-8-0

## IV కన్నడలిపిలో

1. సిద్ధాంతశిఖామణి (మూల శ్లోకములు మాత్రము) 0-6-0

ఇవిగాక శ్రీ కాశీ జగద్గురు మహాస్వాములువారి చిత్రపటములుగూడ దొరకును.

మేనేజరు,
జంగమవాడీ మఠము,
బనారస్ సిటీ.